# మనవి:

"సంజదీపం" మా ఆరవ ప్రచురణ. లోగడ వెలువడిన మా అయిదు ప్రచురణలను అత్యంతాదరాభిమానములతో స్వీకరించిన సహృదయ సారస్వతాభిమానులకు, గ్రంథముద్రణకు సహాయపడిన ఉదారులకు మా కృతజ్ఞతాభివందనములు.

"సంజదీపం" కర్త శ్రీ పూ భా, గల్పికా రచయితగా లబ్ధప్రతిష్ఠులు. వీరి రచనలవలననే 'గల్పిక'కు ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక స్థానం లభించినదని పలువురు సుప్రసిద్ధ విమర్శకుల అభిప్రాయం. 'ఊహా ప్రహేళిక'ను ప్రవేశపెట్టిన తొలితరము వారిలో వీ రొకరు.

సుప్రసిద్ధ కథానికా సాహిత్య విమర్శకులు శ్రీ బొడ్డపాటి వేంకట కుటుంబరాయశర్మగారి వ్యాసములు 'కథానిక : గల్పిక' అను శీర్షికతో 1959 మే నెల స్రవంతిలోను, "సంజదీపం" అను శీర్షికతో 1959 సెప్టెంబర్ స్రవంతి లోనూ ప్రచురితములైనవి. వానిని యీ సంపుటిలో చేర్చుకొనుటకు అనుమతి దయచేసిన శ్రీ శర్మగారికి, యీ సంపుటిని ప్రచురించే అవకాశాన్ని మా కిచ్చిన శ్రీ పూ భా గారికి, శోభాసాహిత్యోద్యమ కార్యకలాపములు విజయవంతముగా కొనసాగుటకు బహుముఖముల కృషి చేయుచున్న శ్రీయుతులు పూ భా, చెల్లూరి చిరంజీవిరావు గార్లకు మా కృతజ్ఞతాభి వందనములు.

శోభా ప్రచురణములు,

విజయనగరం సిటీ.

## ఇందులో ....





# కథానిక - గల్పిక

శ్రీ బి. వి. కుటుంబరావు, M. A., B. Ed.



దేశకాలవ్యవస్థాతీతంగా మానవసంస్కార పరిణామముతో పాటు కథన సాహిత్యమూ పరిణతి పొందుతూ వెళ్తోంది. దీనికి నిర్వచనాలూ, దీన్నిగూర్చిన విమర్శలూ అనేవి శృంఖలాలుగా భావించే భావుకులూ వున్నారు; ఇలా విశృంఖలమై అనిర్ణీతమైన పెంపు వాపు అవుతుందిగాని బలుపు అవుతుందా అనే సంస్కారప్రియులూ వున్నారు.

ఒక యెత్తుగడా, ఒక నడకతీరూ, ఒక ముగింపూ, కొన్ని పాత్రలూ, ఒక పాత్రపోషణావిధానం, వస్తువిన్యాస వైశిష్ట్యం, వస్త్వైక్యం అనే కొన్ని ప్రత్యేకతలతో వినోద విజ్ఞాన వికాసాదిక సాధనంగా కథానికల పలుకుబడి ప్రజా బాహుళ్యం మీద బాగా చెల్లుబడి అవుతున్న దినాలివి. కాబట్టి నన్నడిగితే విమర్శనాత్మకంగానే కథలు చదవాలి అంటాను. అలా మనం చదివినప్పుడే రచనలోని ప్రయోజనం సిద్ధిస్తుంది. రచయితకూడా కృషికి అనుగుణమైన కీర్తిని పొంది కృతకృత్యుడౌతాడు.

ప్రపంచములో కథనసామర్థ్యానికి ఒకప్పుడు భరతఖండానిది పెట్టింది పేరు. ఇటీవల అనేక కారణాలచేత, టాల్‌స్టాయ్, చెఖోవ్, మపాసా, ఓ'హెన్రీ, డి. హెచ్,

లారెన్స్, మామ్, హెమింగ్వే, కేథరీన్ మాన్స్‌ఫీల్డ్, హెచ్.ఇ. బేట్స్, ఫ్రాంక్ ఓ కోనార్, విలియమ్ సారోయిన్, విలియమ్ ఫాక్నర్, ఆర్. యల్. స్టీవెన్సన్ ప్రభృతి మహానీయుల ప్రభావం బలీయంగా మనపై ముద్రితమైంది. కాని మన కథానికారచనల్లో భారతీయ ప్రతిభాసమున్మేషాలైనవి చాలా వున్నై.

భిన్న భిన్న మనఃప్రవృత్తులను రజింపఁజేసేందుకు భిన్నభిన్న మనోరీతులుగల రచయితలు తెలుగులో కథానికా విశేషాలు అని భిన్న భిన్న మార్గాలు తొక్కుతున్నారు. అవి అనూహ్యాలై మనోముగ్ధకరములై సాగుతూ నేటి భారతీయ సాహిత్యంలో సాటిలేనివిగా వున్నై. గల్పిక, అల్పిక, ఛాయ, ఊహాచిత్రం, భావచిత్రం, వాక్చిత్రం, భావ జ్వాల, ఊహాప్రహేళిక మొదలైన పేర్లతో చెంగుచెంగున గెంతుతూ, పొంగెత్తే సెలయేళ్ళ దరిని నిలబడి శుభోదర్క-శోభనమూ, సుషమాసుందరమూ అయిన భావికాలంలోకి ఊహాల నిగిడిస్తూన్న పుణ్యభూమిలో పుట్టిన మనకంటే అదృష్టవంతు లెవరు?

కాకపోతే, మనస్తత్త్వ వేత్తలూ, కామతత్త్వ వేత్తలూ ప్రతిపాదించిన ఉపచేతనాఽవచేతన (Sub-conscious and Unconscious) మూలకాలు కావడంచేత నేటి కథానికలు చాలవాట్లు ప్రేమసంబంధులనిన్నీ; ఆర్థిక శాస్త్రవేత్తలైన మార్క్సు ప్రభృతులు సిద్ధాంతమూలకా

లవడంచేత ఆ కవి సంబంధులనిన్నీ నిరసింపబడుతున్నై. అయినప్పటికీ సర్వమానవసాధారణ్యం గల పురుషార్థాల గూర్చి వ్రాయక, ఆహారనిద్రాదికావశ్యకాలని గూర్చి వ్రాయక నేల విడిచి సాము ఎలా చేస్తాం? అందుచేత అంతగా నిర్మాణాత్మకాలు గాని ఆ విమర్శల జోలికి మనం పోలేం.

నేడు మన కథానిక ముఖ్యంగా వస్త్వైక్యాన్ని సాధిం చేందుకు కొన్ని లక్షణాలను పాటిస్తోంది.

1. సంక్షిప్తత : సంగ్రహత అనే అర్థం అసలు చిన్న కథ అనే దాని పేరులోనే వుంది. కాని ఇది దేనికి సంగ్రహము? నవలకూ, పెద్దకథకూ, సంగ్రహరూపమని కాదు. కథావస్తుసంగ్రహత కలదని భావం. చిన్నకథ చిన్ని కథ కావాలంటే, వివరాల్లోనూ, సంఘటనల్లోనూ, పాత్ర ల్లోనూ, అన్నిటిలోనూ సంక్షిప్తత కనబరచాలి రచయిత.

2. ఏకాంశవ్యగ్రత :— అంటే కథాసంవిధానంలో అనేకాంశాలు అడుగడుగునా ముడిబడి ఉండరాదు; ఒకే అంశంమీద నిష్ఠ నిలపాలి కథకుడు.

3. నిర్భరత :— చదివేటప్పుడు కంటికి తెప్పపాటు గాని, వ్రాసేటప్పుడు మనస్సున కేమరుపాటుగాని రానీయని లక్షణ మేదో అది నిర్భరత అనే మూడో గుణం.

4. స్వయంసమగ్రత :— కథానిక స్వయంసంపూర్ణమై వుండాలి. అనగా సాపేక్ష్యం గారాదు; నిరపేక్ష్యంగా వుండాలి.

5. ప్రతిపాద్యప్రవణత :– కథానికలో ఏ సత్యాన్ని లేక ధర్మాన్ని ప్రతిపాదిస్తున్నామో, ఆ ప్రతిపాద్యంమీద నే మన చూపు నిలపాలి. చెదిరి బెదిరిపోకూడదు. చెదిరిపోతే రెండుతలలు లేక మూడు తలల శిఖండి అనే దోషంపేరుతో పిలుస్తాం ఆ కథానికను. బెదరిపోతే బీజసంహారకం అంటాం.

6. సంవాదచాతుర్యం :— ఇది వెన్నతో బెట్టిన విద్యగా వుండాలి, కథానికా కర్తకు. చక్కని సంభాషణలనుబట్టే నాటికతో పోటీ చేయగలదు కథానిక.

ఇక ఈ లక్షణాలని ఉదాహరిస్తూ కూడా పోతే తీగ మోయలేని పండు అవుతుంది, నా యీ విశ్లేషము కాబట్టి హృదయ స్పందనం విస్తరణం ద్రవీకరణం గల్గించి, సహృదయుల కానందం గొల్పే శక్తు లున్నయ్యా కథలో అనేదే మనం ఒరిసి చూడాలని ఒక్క మనవితో ముగిస్తాను.

ఈ క్రింది కథాసాహిత్య ప్రక్రియకు దేనికైనా సరే వుండాల్సిన ఆరు తత్త్వాలూ దిఙ్మాత్రంగా చెప్పి, తరువాత నేను గమనించినంతవరకూ కథానికా గల్పికల శిల్పంలోని తారతమ్యాన్ని ఉటంకిస్తాను.

(1) వస్తువు (2) పాత్రలు (3) సంవాదాలు (4) వాతావరణం (5) శైలి (6) ఉద్దేశం (ఆదేశం – లేక ప్రతిపాదితాంశం.) అనేవి ఆరున్నూ కథనసాహిత్య మూలాధార తత్త్వాలు.

'గల్ప' అంటే హిందీలో కథానిక అనియే అర్థం. కాని కథానికాభేదంగా 'గల్పిక'కు మన తెలుగులో రూఢి

యోగం కలుగుతోంది. ఆఖ్యానకము, కథానకము, కథానిక, కథాళిక, గల్పిక మొదలైన మాటల్లోని 'అక, ఇక మున్నగు ప్రత్యయాలు స్త్రీలింగద్యోతకాలై సాహిత్యరూపాలకంటె పరంగావడం ఆధునికయుగంలో సమస్తభాషల్లోనూ ఒక అందం, ఒక ఆచారం అయిపోయింది. పోగా 'గల్పిక' అనే ప్రక్రియ సమకాలీనసారస్వతాల్లో మన ఆంధ్రసాహిత్యములో వున్నంత ప్రస్ఫుటంగా రూపురేఖలు తీర్చిదిద్దుకుంటున్నట్లు చెప్పలేము. పాశ్చాత్యుల్లో మార్క్‌ట్వెయిన్, ఓ హెన్రి, ఓడ్‌హౌస్ ప్రభృతులను వీటికి పితృనిర్విశేషు లంటారు. కాని కథానికాభేదంగా 'గల్పిక'అనే శాఖను ఆరాధించడం ఆంధ్రేతర భాషల్లో మృగ్యమన్నా సత్యేతరం కాదు. తెలుగు సాహిత్య విశిష్టతే అనాలి. కొడవటిగంటివారిది ఆంధ్ర 'గల్పికకు' పితృవ్యులైన గౌరవం అంటారు. చలం, ఇంద్రకంటి, శ్రీ శ్రీ, మధురాంతకం, బలివాడ, పూఖా, గోరా శాస్త్రి, రాంపా మున్నగువారు వస్తు, సంవిధాన, శిల్ప విషయకంగా గల్పికల్లో తీరుతీరులు గల ప్రయోగాలూ, సాధనలూ, చేసి చూపుతున్నారు.

గప్పాలు కొట్టకోయ్ అంటాం. 'గల్భము'అనే పదం సరియైన అర్థమిచ్చేది సంస్కృతంలో ఒకటి వుంది. 'ప్రగల్భం' అనేది యెరగని ఆంధ్రు డుండడు. 'గల్పిక' అనే యీ పదం యే భాషకు చెందినదో దీని పుట్టుపూర్వోత్తరా లేవో స్థలాంతరాన, కాలాంతరంలో సమీక్షించాలి. ముళ్లు

లేని గులాబి, సర్పంలేని స్వర్గం ఉండదన్నట్లు వెటకారంలేని 'గల్పిక' కూడా వుండదని కొందరు ప్రాజ్ఞులు. ఆంగ్లములో 'స్కెచ్' అనబడేదే మనలో 'గల్పిక' అయిందంటారు, మఱికొందఱు. క్రమేణ నిర్ణయించాలి వీటినన్నిటినీ.

కథానిక : గల్పిక :

1. ఆకృతిలో గల్పిక కథానికకంటే చిన్నది. చిన్నకథ చిన్నదిగా వుండాలి అనే నిర్వచనం చమత్కారానికే. ఆకారంలో చిన్నదిగా వుండడం మాత్రమే దాని లక్షణం గాదనుకోండి.

2. కథానిక మానవజీవితానికి అచ్చంగా ప్రతిబింబం అయి వుండాలి. గల్పికలో ఆ నియమం అతిక్రమించబడ వచ్చు. ప్రాయికంగా హేళనాత్మకం గనుక పాత్రలూ, సన్నివేశాలూ అన్నీ కొంచెం సహజత్వాన్ని మించి అతిశ యిస్తా యన్నమాట. అసలు కళలే ఆ మాటకొస్తే కొంచెం సహజత్వానికి అతిశయరూపాలు. కాబట్టి వాస్తవికత, ఆదర్శకత అనేవాటిని గూర్చి బహుసూక్ష్మంగా విచారించి యిక్కడ నిర్ణయం చేయాలి, విస్పష్టంగా చెప్పాలంటే.

3. కథానికలాగే గల్పికకూడా పాఠకుణ్ణి ఆశ్చర్యంలో ముంచే కాస్త మెరుపుతోనే అంతమౌతుంది. దీన్నే కథ అడ్డం తిరగడం అంటారు. అయితే జీవత్కథానిక అని చెప్పదగినదాన్ని చదివి ముగించిన చదువరి కాసేపు అంత ర్ముఖుడై కథానికాగతాలైన మానవస్వభావాలు మొదలగు

వాటిని గూర్చి ఆలోచిస్తాను. గల్పికను చదివి ముగించిన చదువరి ఫక్కుమని ఒక్క నవ్వు నవ్వి, అంతలోనే యింకో గల్పిక చదవడానికి ఉపక్రమిస్తాడు.

4. కథానిక మానవ జీవితంలోని ఒక అంశాన్ని చిత్రిస్తే, గల్పిక వ్యక్తియొక్క అనుభవంలోని దశావిశేషాన్నో, ఒక సంస్థదైన పరిణామవిశేషాన్నో చిత్రిస్తుంది అనాలి.

5. 'సాధారణ మానవజీవితంలో ఒడుదుడుకుల్ని చిత్రించేది కథానిక' అంటే సార్వజనీనత కలది. ఒకానొక వ్యక్తినిగాని, ఒకానొక వ్యవస్థని గానీ అవహేళన చేసేది గల్పిక. అంటే వ్యక్తిపరమైన విశిష్టతనే చిత్రిస్తాడన్నమాట. అది సార్వజనీనమైతే - ఇది వైయక్తికం.

6. కథానిల్లోకంటే గల్పికల్లో సన్నివేశప్రాధాన్యం అధికం.

7. అలాగే, ఆరోహణావరోహణక్రమవిన్యాసమున్నూ, ఉచ్ఛ్రయ పతనాలతో గూడిన సంఘటనల చిత్రణమే గల్పికలోని శిల్పం. ప్రడీన - ఉడ్డీన - సండీనాలతో పెనగిన ఒక క్రమవికాసం అంటాం దీనిని.

కాని విశదంగా విడమరచడానికి వీల్లేనంత క్లిష్టంగా ఈ గల్పికా కథానికలు రూపగుణసాదృశ్యంతో పెనవైచుకొని ఉంటాయని మరువరాదు.

పారిశ్రామికయుగ ప్రభావం మనలోనూ బాగా పాదుకుంది. ఆ కారణంచేత మన అభిరుచుల్లో, ఆచారవ్యవహారాల్లో, జీవితదృక్పథంలో, ఎంతో మార్పు వచ్చినమాట నిజం. అందువల్ల ఇతర సాహిత్యాలలోని పరిణామాలని గమనించక తీరదు. వాటి నెంత గమనించవలసి వచ్చినా, ఎంత అంతర్భూతం చేసుకున్నా గానీ, భారతీయసంస్కృతిలోని బలాన్ని భారతీయులం మనం స్వీకరించి తీరాలి. జాతీయదృష్టి లేని అంతర్జాతీయతను అంతగా అభినందించ లేకపోవడం దౌర్బల్యం కాదు. కాని మన జాతికీ, మన సంస్కృతికీ, సార్వకాలిక ప్రతినిధులుగా మన కథానికలూ, మన గల్పికలూ నిలబడాలంటే, (1) వస్తువు, (2) ప్రతిపాదితాంశమూ, (3) కథనశిల్పం, (4) పాత్రలూ, (5) పాత్రపోషణా, (6) సంఘటనలూ, (7) సంవాదాలూ, (8) శైలీ ఇత్యాది సమస్తాంశాలకీ సముచితప్రాముఖ్యం ఉండాలి.

చెప్పవలసిందంతా చెప్పివేశా నని నే ననుకో లేను. ఈ రచనల విషయం ప్రవాహోదకం వంటిది. కథాసాహిత్యం కదను త్రొక్కుతూ ఎప్పు డేయే తెన్నులు పోతుందో ముందే జోస్యం ఎలా చెప్పగలడు సహృదయ విమర్శకుడు ? పుట్టని బిడ్డకు పేరు పెడతామా ? పురిటిలో నే గల్పిక జాతకం చెబుతామా ? మొగ్గని తుంచడానికీ, పిందెను కోయడానికీ రసజ్ఞు లొప్పుకోరు.



# సంజదీపం.

'గెంతుతోంది'......... 'గెంతుతోందే!'

'అయితే నన్నేం చెయ్యమన్నారు...'

'దీనికీ రోగం ఎప్పుడు పోతుందో గాని...'

'తీసుకువెళ్ళి బాగుచేయించండని నోరు నొప్పిపుట్టేటట్టు చెప్తూనేవున్నాను.'

'పగలు జ్ఞాపకం చెయ్యకూడదూ?'

'నూరు రూపాయలు జీతం తెస్తూండే మీ తెలివితేటలకే జ్ఞాపకం లేకపోతే...'

'ఇదేం రోగమో'

'పోనీ యిప్పుడు తీసుకు వెళ్ళకూడదూ!'

మనకోసం వాళ్ళు కూర్చుంటా రనుకున్నా వేమిటి!'

'పోనీ రేపైనా మరచిపోకుండా తీసుకు వెళతారా'

'రేపటిదాకా ఎలా వెళుతుంది? ఈ రాత్రి యీ కాయితాలన్నీ వ్రాయకపోతే ఎలాగ? అన్నీ అర్జంటే.'

'రేపు పదకొండు గంటలకి కదా ఆఫీసు, ఉదయము లేచి వ్రాసేయకూడదూ.'

'ఈ దస్త్రాన్ని చూసే మాట్లాడుతున్నావా ?'

'అదేమో బాబు, నా కేం తెలుస్తుంది.'

'నీ కేం తెలుస్తుంది. ఇదేం ఉప్మా చెయ్యడం అనుకున్నా వేమిటి? తద్దినంవంట తంతు. ఇప్పుడు బోధపడిందా.'

'పోనీ నేనుకూడా సాయం చేయనా'

'సరే! అదే బంగారమైతే అమ్మకు నే తిందునన్నాట్ట.'

దీపం గప్పునమండి ఆరిపోయింది.

'పాడింది మంగళం ! యుద్ధంలో తయారయిన అన్ని లాంతర్లకీ యిదే రోగమల్లే ఉంది.'

'లేచి చక్కా భోజనం చెయ్యండి. లేకపోతే ఆ దీపం మంగళం పాడేస్తుంది. చమురు లేదు.'

'ఎప్పుడూ ఏదో ఒకటి లేదంటూనే ఉంటావే !'

'ఉంటే అనవలసి ఎందుకు వస్తుంది.'

'ఆడవాళ్ళ లక్షణమే అంత. చూడు తిరిగి రేపనింగు పెడతారుట'

'పోనీండి. పైపైని కుంచం నాలుగు రూపాయిలకో అయిదు రూపాయిలకో దొరుకుతాయికదా.'

'పైనా ! నాలుక్కాదు నలభై రూపాయ లిచ్చినా ఒకగింజ దొరకదు.'

'అయితే మరెలాగ ?'

'ఎలాగేమిటి ? అలాగే. రోజుకు నాలుగాస్సులు

బియ్యం. అంటే పదితులాలు. నీ లెఖ్ఖకి చెప్తాను విను, అరసోలడు.'

'రోజుకా ?'

'మరేం !'

'ఎలా సరిపోతాయండీ ! ఒకపూటకే చాలవుకదా.'

'అలాగే కాలక్షేపం చేసుకోవాలి.'

'ఎంత పొందికగా కాలక్షేపం చేసుకున్నా ఎలా చాలతాయండి !'

'ఒకపూట తినడం, రెండో పూట...'

'పస్తే'

'మహారాజులాగ. లేకపోతే రాత్రి వేరుశనగపప్పు తినడం, మంచినీళ్ళు తాగడం.'

'ఉండగలమా ?'

'ఉండాలి. గాంధీగారు అలా ఉండేవారు కారూ ? ఎన్నాళ్ళనుంచి చెపుతున్నా గాంధీగారి తత్వం అవలంబిస్తే బాగుంటుం దని. చెవిని పెట్టావా! దారం తియ్యబడుతుందని ఆ రాట్నాన్ని విరిచి మూలతో సేసేవ్ కదా. ఈ మధ్య కర్రలు లేవని అఘోరించావు. పొయ్యిలో పెట్టే లేదుకద ?'

'బాగుందండి ! మీరూ మీ మాటలూ. నేను విరిచేశా నంటారు మీరు కళ్ళారా చూస్తూండగానే విరిచేశాడా నానిగాడు ?'

'ఎలాగో మెల్లిగా పనికిరాకుండా అయిందికదా. నాలుగు దారాలు రోజూ తీస్తే ఏ ధోవతో లేక చీరో

అవదూ.. ఇకచూడు బట్టలకి కూడా రేషనింగు వస్తోంది. అప్పుడు తెలుస్తుంది. ఏంచెప్పినా బుర్ర కెక్కుతుందా! గిరీశం చెప్పినట్టు ఆత్మానుభవం అయితేగాని తత్వం బోధపడదు'

'ఈ రేషనింగువాళ్ళకి ఏమీా ఊసుపోదటండీ?'

'మొత్తానికి తెలివైన ప్రశ్నే వేశావు.'

'ఇప్పుడైనా రెండుబస్తాలు కొనుక్కుని దాచుకుంటే ఏం?'

'డబ్బో. అదీగాక తనిఖీచేసి పట్టుకుంటారు.'

'మొత్తంమీాద వీళ్ళు బతకనిచ్చేటట్లు లేదు. పోనీ ఆ వేరుశనగకాయలైనా రెండుబస్తాలు కొనండి. దాని కూడా రేషనింగు పెట్టారంటే...'

'దానికూడా రేషనింగు పెడితే గాంధీగారి ఆఖరు తత్వం నిరశనవ్రతం ఉండనేఉంది నీ బుర్ర కెక్కదుగాని గాంధీగారి సూత్రాలను మనం అక్షరాల అమల్లో పెట్టామంటే ప్రతి క్లిష్టసమస్యనీ ఎదుర్కోవచ్చు.'

'అందర్నీ గాంధీమహాత్ములైపోవా లంటారు మీారు!'

'మన పూర్వీకులు చేసినట్టు మనం కూడా యిక ప్రతి ఏకాదశికీ ఉపవాసం, శని ఆదివారాలనాడు ఒంటిపూటా, మొదలైనవన్నీ ఆచరణలో పెట్టాలి.'

'బాగుంది. మూాడుపూట్లా తింటూంటేనే మొఖం తిరుగుతోంది. ఇక అడిగారా. అదీగాక యిప్పటి బియ్యంలో సత్తువే లేదు'

'మనం అన్నింటికీ తయారై ఉండాలి.'

'బియ్యం లేనందువల్ల భోజనం మానేసినారు. రేపు బట్టకి...'

'అయితే యిదంతా నేను కల్పించానంటావేమిటి.'

'మీకు సంతోషమేగా. బట్టలు కుప్పలు కుప్పలుగా దొరికేటప్పుడే లేదు. ఇకమీదట అసలే ఉండదు. తప్పించుకుందుకు అవకాశం కూడా దొరికింది.'

'నేను చెప్పానుకదూ. ఎన్నిఉన్నా లేవనడం ఆడవాళ్ళ లక్షణం. చీరలు లేకుండానే కాలక్షేపం చేస్తున్నావు కామోసు యిల్లాలివి.'

"అప్పుడు దొరకవు కామోసు రేపు వెళ్ళి నాలుగు చీరలు తీసుకు రాకూడదండీ?"

"డబ్బుంటే నాలుగుకాదు నలభై తీసుకు రావచ్చు."

"నా దగ్గరికి వచ్చేసరికే డబ్బు ఉండదు."

"అయితే యిప్పుడు బియ్యమే కొనడమా, వేరుశనగకాయలే కొనడమా, దీపమే బాగుచేయించుకోవడమా, యీ కాయితాలే రాసుకోవడమా."

"అన్నీ సమస్యలే. ముందు వేగం కాళ్లు కడుక్కోండి. ఆ దీపం కూడా గెంతుతోంది. మాటల్లో మంగళం పాడేస్తే, ఎప్పుడో పస్తు పడుకుంటామో లేదో గాని యిప్పుడు పడుకోవాలి."

---

# మానసపుత్రుడు.



మల్లెపువ్వులు చూస్తే మాలతి జ్ఞప్తికి వచ్చినట్లు కొన్నింటిని చూస్తే కొన్ని సంఘటనలు జ్ఞాపకానికి వస్తాయి.

నిరుడీ రోజుల్లో అత్తవారి ఆహ్వానాన్ని పురస్కరించుకుని బయలుదేరాను. అత్తవారింటికి సంక్రాంతికి వెళ్ళటం అదే ప్రప్రథమం. శ్రీమతి వారంరోజులక్రిందటే వెళ్ళింది.

స్టేషన్ చేరే సరికి సాయంత్రం ఆరైంది; చిన్నచినుకులూ, ఈదురగాలీ - చిరాకుగా ఉంది. అయినా పుట్టింటనున్న శ్రీమతిని సంక్రాంతిశోభలో చూదామనే ఉబలాటంతో ప్రయాణాన్ని విరమించుకోలేక పోయాను.

"బండి మూడు గంటలు ఆలస్యం" అన్నాడు స్టేషన్ మాష్టరు.

అసలు నేను ఎప్పుడు బయలుదేరినా బళ్లు ఆలస్యంగా రావటం పరిపాటైంది.

వాతావరణం బాగా లేకపోవడం వల్ల ప్రయాణీకుల సంఖ్య చాలా తక్కువగా ఉంది.

మూడవతరగతి వెయిటింగ్‌రూమ్‌లో కూర్చున్నాను. ఈదురగాలి చీదరిస్తోంది. భోజన సదుపాయాలకి

యిబ్బంది కలిగించి, వేళకాని వేళల్లో బయలుదేరే రైలు బండీ మీద కోపగించుకుని, అరుస్తూన్న టీ కుర్రాడిని టీ తెమ్మని కేక వేశాను.

"సీతా! వస్తున్నావా" అంటూ ఒక వృద్ధవితంతువూ, ఆమె వెనకాల చంటి పిల్లాడిని ఎత్తుకుని ఇరవై సంవత్సరాల సీతా ప్రవేశించారు. పాపం బాగా తడిశారు.

"బాబూ! ఒక్కసారి అవతలకు వెళతారా. కాస్త బట్టలు మార్చేసుకుంటాం" అంది ముసలమ్మ.

సానుభూతిని నిశ్వసిస్తూ బయటకు వచ్చాను చలి గాలిలో బైట ఉండడం కష్టంగా ఉంది.

"రా నాయనా, రా!" అంటూ ముసలమ్మగారు తలుపు తియ్యగానే లోపలికి వెళ్ళి బెడ్డింగు విప్పి చేరబడ్డాను.

"బండి యింకా ఎంతసేపటికి వస్తుంది నాయనా!"

"ఇంకా రెండు గంటలు పోవాలండి"

"రెండు గంటలే!"

"ఆఁ"

ఆ ముఖంలో దీనత్వం, చూపుల్లోని విచారం పాపం! ఏం బాధపడుతోందో సీత. మానసికంగా ఆమె పడుతూన్న బాధంతా ఆమె ముఖంలో తాండవమాడుతోంది. ఆమెను చూస్తే చాలా జాలి వేసింది. ఇరవై సంవత్సరాలైనా నిండని ఆమె జీవితంలో ఎంత నైరాశ్యం!

పిల్లాడు లేచి ఏడవడం ప్రారంభించాడు. తల్లెంతో

బుజ్జగించింది. బిస్కత్తులు తీసియిచ్చింది ఏంచేసినా లాభం లేకపోయింది. బూచివాడికి అప్పచెపుతా మన్నారు ముసలమ్మగారు. దానితో ఏడుపు హెచ్చయింది. అమ్మచేత ఒక దెబ్బకూడా తిన్నాడు. ఏడుస్తూ నావేపు చూసి పరుగెత్తుకు వచ్చి "నాన్నా! "నాన్నా! అమ్మ!... అమ్మ!" అంటూ నా వళ్లో కూర్చున్నాడు.

విషమపరిస్థితిలో పడ్డాను. అకుర్రాణ్ణి చేరదియ్యడమూ లేక వెళ్ళగొట్టడమూ ఏం చెయ్యాలో నా కేం అర్థం కాలేదు. అలాంటి పరిస్థితిలో నే నెప్పుడూ పడలేదు.

సీత కుపితనేత్రాలు నావైపు చూశాయి. సిగ్గుతో ఆత్రుతపడుతోంది పిల్లాణ్ణి తీసుకుందామని.

"ఒరే ప్రసాద్! రా! రారా! వెధవా! తప్పుగాదు? ఇలాగా? అని ముసలమ్మగారు మందలిస్తున్నారు. కాని ప్రసాద్ ఏడుపుమాని చక్కా కూర్చున్నాడు.

"ఇలా రారా! వెధ......వా!" అని గద్దించింది ముసలమ్మ. ప్రసాద్ తిరిగీ ఏడుపు ప్రారంభించాడు. 'నా... న్నా... ఆ..."

ముసలమ్మగారు వచ్చి ప్రసాద్‌ని తీసుకు వేసరికి ఏడుపు మరీ ఎక్కువైంది.

సీత కళ్ళంట నీళ్లు తిరుగుతున్నాయి. నాకన్నా విపరీతపరిస్థితిలో పడింది, ఆమె. నోటంట మాటకూడా రావట్లేదు. పాపం ఏం మాట్లాడుతుంది?

ఇంటికప్పు ఎగిరిపోయే టట్లు "నాన్నా ! నాన్నా !" అని ఏడుస్తున్నాడు ప్రసాద్.

ప్రక్క గదిలోనుంచి స్టేషన్‌మాస్టర్ వచ్చి "ఏమండి సార్ ! కాస్త కుర్రాణ్ణి ఊరుకోబెట్టండురూ" అని చీదరించుకుంటూ హెచ్చరించాడు.

మేష్టరుగారు చెప్పింది మరీ బాగుంది అనుకున్నాను.

"ఒక్కసారి నీ దగ్గర కూర్చోబెట్టుకో, నాయనా ! ఏదో కుర్రాడు" అంది ముసలమ్మ.

ప్రసాద్ వచ్చి చక్కా కూర్చున్నాడు. పెట్టెలోంచి రొట్టె తీసి యిచ్చాను.

"ఏదో వాడి ఖర్మం యిలా కాలిపోయింది. ఏం జేస్తాం, నాయనా ! పండులాంటి కూతురు బ్రతుకంతా బుగ్గైపోయిందికదా, చదువుకున్నవాడు, బుద్ధిమంతుడు, మర్యాదస్తుడు, నలుగురిలోనూ తలెత్తుకు బ్రతుకుతున్నవాడు ప్రపంచానికి బరువైపోయాడు. ఆ చావు నాకైనా వస్తే ఎంత బాగుండేది. కొడుకైనా, కూతురైనా యిదే ననుకొని పెంచాను. నా ఆశ లన్నీ దీని మీదనే పెట్టుకున్నాను. తగిన కట్నం యిచ్చి మంచి సంబంధం చేశా నని గర్వపడ్డాను. భార్యాభర్త లిద్దరూ అనురాగంగా ఉన్నారని పొంగిపోయాను. అంతేకాని యిలా అవుతుం దని ఎప్పుడూ అనుకోలేదు. నూరేళ్ళ బ్రతుకూ మంట కలిసిపోయింది !" అంటూ

ఏడవడం మొదలుపెట్టింది ముసలమ్మ

పరిస్థితి పూర్తిగా అర్థమైంది, సీతనుచూసి మరీ జాలి వేసింది. కాని నా సానుభూతితో చెయ్యగలిగిందే ముంది గనుక !

"ఎవరికన్నా పెద్దవాడు? చెప్పు— సరిగ్గా నీలాగే ఉంటాడు— సరి అయిపోయింది. తీరిపోయింది—"

"ఊరుకోండి మామ్మగారు, అయిపోయినదానికి ఎంత విచారిస్తే ఏం లాభం చెప్పండి" అనగలిగాను కష్టంమీద.

సీత కళ్ళంట నీళ్ళు జలజల కారుతున్నాయి. రెండు చేతులమధ్యా తలపెట్టుకుని ఏడుస్తోంది.

నిద్రపోతూన్న ప్రసాద్‌ని ముసలమ్మగారు తీసుకున్నారు.

బండీ వచ్చేసింది.

అంతా లేచి బండి ఎక్కాం.

ఇదంతా ఒక నాటకం అనిపిస్తుంది. మల్లెపువ్వుల్ని చూసినప్పుడు మాలతి జ్ఞప్తికి వచ్చినట్టు ఆ స్టేషన్‌ని చూసినప్పుడల్లా యిదే సంఘటన జ్ఞాపకానికి వస్తూంటుంది. — ప్రసాద్ ఏడుపూ, సీతా, సీత ముఖం, అందులోని దీనత్వం, ఆమె కళ్లూ, అందులోని విచారం. అప్పుడు అప్రయత్నంగా నా సానుభూతి సీతవైపు పరుగెడుతుంది. కాని ఆమెజాడ తెలియక బాధపడుతుంది.

# తీయని వెన్నెల రేయి.



అప్పుడే వచ్చిన పసుపు పచ్చని పెద్దకవరు అతి తొందరగా విప్పి, ఆమూలాగ్రంగా చదివి, చిన్న నవ్వు నవ్వి, మీసాల్ని మెలివేసి, "వెంకన్నా" అని పిలిచి, లేచి ప్రక్కనున్న నిలువుటద్దంలో ముఖం చూసుకుని, చేరుమాలుతో తుడుచుకుని, తిరిగీ కుర్చీలో కూర్చుని, తన పిలుపుకి సమాధానం లేని వెంకన్నని మరో కేక వేశాడు, నిరంజనం పంతులు. "చిత్తం, బాబూ!" అనుకుంటూ వెంకన్న ఆవలిస్తూ ప్రవేశించాడు.

"గాడిదా! కునుకుతున్నావురా?"

"లేదు, బాబయ్యా!"

"సరిలే—ఉత్తరం వచ్చిందిరా!"

"అవును, బాబూ! నేనే తెచ్చాను."

"ఎక్కణ్ణుంచో తెలుసా?" గర్వంతో కూడిన ఆనందంతో అన్నాడు.

"నా కెలా తెలుస్తాది, బాబూ?"

"అక్కణ్ణుంచిరా."

"అంటే బాబూ?"

"ఆమాత్రం తెలీదురా?"

"ఆ! ఆ! వెల్లూరి కాడనుంచాండి?"

"ఆ! సరిగ్గా చెప్పావురా."

"ఏటి శేషాలు బాబూ?"

"ఆ అలా అడగాలిరా వెంకన్నా - వెంకన్నా! నీకు తెలివైనవాడి లక్షణాలు లేకపోలేదు సుమీ."

"చిత్తం - చిత్తం."

"అమ్మగారు నన్ను పెళ్లాడిందికి యిష్టపడ్డారుట్రా."

"వెయ్యేళ్ళకీ అదే కావాలి, బాబయ్యా! మీరు కులాసాగా కాపరం చేస్తూంటే వెచ్చగా గుమ్మంకాడ కూకుంటా."

"ఇంకా విను. అమ్మాయికి పాతికేళ్లుట."

"లేత వయస్సే బాబూ."

"బియ్యే చదివిందట్రా."

"పెద్దచదువే బాబూ! తమరూ అందాకానే కదండీ చదివింది."

"మనం అంతే చదివినా మనది పూర్వం బియ్యేలే. అంటే ఇప్పటి యం. ఏ. కి బాబన్నమాట. తెలిసిందా?"

"ఏటో బాబూ, ఆ చదువులగోడవే మాకు తెల్దు."

"ఇంకా విను. సంగీతంకూడా వచ్చుట."

"ఇంక మరేం బాబూ, తమకి బాగా ఊసుపోతాది."

"కుట్టుపనీ, అల్లికపనీ కూడా వచ్చుట."

"అహా!"

"ఇంకా మనకేం కావాలా!"

"చాలు బాబయ్యా!"

"ఇదుగో చూశావా - ఈ కస్తూరి ఎంత చక్కగా ఉందో!"

"ముత్యాలు బాబూ!"

"ఆ ఫోటో చూశావా?"

"రత్నం! రత్నం!! కాని ఆ కన్నుకి మెల్ల ఉందేమో అని అనుమానం."

"మెల్ల కాదురా. అది ఫోటోగ్రాఫరు తప్పు. ఈ ఫోటోగ్రాఫర్లున్నారే పందిని నందినీ, నందిని పందినీ చేస్తారురా."

"అవును బాబయ్యా! కాని నాకు ఒక్క సందేహం."

"చెప్పరా."

"ఇంత చదువుకుని, ఇంత యిది చేసినారు కదా, యింతవరకూ అమ్మగారికి పెళ్ళి కాకుండా ఎందు కుండి పోయారా అని."

"పాతికేళ్ళు ఒక పెద్దట్రా వెంకన్నా! ఐనా నే చెప్తా విను; ఇదంతా ఘటన. ఏ స్త్రీకీ, ఏ పురుషుడికీ ఘటన ఉందో ఎవరు చెప్పగలరు చెప్పు. అందుకే తెల్లవాళ్ళు ఏమన్నారూ 'మేరేజస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్' అంటే పెళ్ళిళ్ళు స్వర్గములోనే చేయబడ్డాయి..."

"చిత్తం - చిత్తం."

"పెళ్ళిముహూర్తంకూడా స్థిరపరిచారు."

"ఎప్పుడు బాబయ్యా?"

"వచ్చే సోమవారం. ఈలోగా మనం చెయ్యవలసిన పని చాలా ఉంది."

"చిత్తం."

"ముందు నా పడకగదిలోని ఆడబొమ్మలన్నీ తీసి పారేయాలి."

"చిత్తం."

"ఎల్లుండి మనం వెళ్ళి బజార్లో సామాన్లు కొనుక్కోవాలి."

"చిత్తం."

"ఈ రెండురోజులూ నువ్వు లేని ఓపిక తెచ్చుకోవాలి."

"ఎంతమాట బాబు!"

"వెంకన్నా! ఇలా వెనక్కిరా."

"ఏం బాబయ్యా."

"చూడూ, వెంట్రుక లేమేనా తెల్లబడ్డాయేమో."

"...ఆఁ! అక్కడక్కడ..."

"అదిగో! ఆ గదిలో రంగుడబ్బా ఉంది తెలుసా."

"ఆ! ఆ!"

"అది తీసుకురా."

... ... ... ...

"ఒరే వెంకన్నా! చూడు. ఆ సంగతి...ఏదను కున్నావ్...ఆ సంగతి... పెళ్ళివారికి తెలియనియకేం."

"...ఏ సంగతి బాబయ్యా."

"ఉత్త శుంఠవిరా! నీకు అంతా విప్పిచెప్పాలి."

"ఏదో ముసలివాణ్ణి బాబయ్యా! తమ రలా కోప గిస్తే..."

"ఇదుగో నాకు నలుగురు పిల్ల లున్నా రని ఎవరకీ తెలియనీయకేం. పెళ్ళయిందాకా ఏ గొడవా కాకుండా ఉంటే తరవాత ఏమైనా ఫరవా లేదు. అసలు నేను వాళ్ళకి వ్రాయడంలో పిల్లలు లేరని వ్రాశా— తెలిసిందా."

"చిత్తం. నాకెందుకు బాబయ్యా మధ్యని."

"సరేలే! నువ్వింక వెళ్ళు."

## 2

రిజష్ట్రారు ఆఫీసులో పెళ్ళి చేసుకుని నిరంజనం పంతులూ, కమలా కారెక్కారు.

"మీ వాళ్ళెవరూ రాలేదేం?" అన్నాడు పంతులు.

"ఉన్న వాళ్ళు ఎవరు కనుక, మా అమ్మ నా చిన్న తనంలోనే పోయింది. నాన్నగారు యీ మధ్యనే కాలం చేశారు. అన్నయ్య సాయంకాలం వస్తాడు, కొంతమంది స్నేహితులతో. అయినా పెళ్ళికి పెద్దబెడద చేసుకోవడం నాకు నచ్చదు. ఆపురోహితుల్నీ, బ్యాండు మేళాల్నీచూస్తే

న్యూసెన్సనిపిస్తుంది. ఇలాగే బాగుంటుంది తేలిగ్గా, చడీ చప్పుడూ లేకుండా."

"సరిగ్గా నువ్వన్నది నిజం. ఈసందడంతా న్యూసెన్సా, న్యూసెన్సున్నరా? అవన్నీ నాకూ గిట్టవు – కమలా!"

"మన అభిప్రాయాలు కూడా సరిపోవడం చాలా సంతోషించ దగ్గ విషయం."

"అదీ అదృష్టమే. ఐతే రేపు డిన్నర్ ఏర్పాటు చేసుకుందామా?"

"ఆ!"

కారు నిరంజనం పంతులు మేడముందు ఆగింది. వెంకన్న స్వాగతం యిచ్చాడు. దంపతులు లోన ప్రవేశించారు.

"ఎవరూ లేరేం?" అంది కమల.

"నాకూ నీలాగే తల్లీదండ్రీ లేరు. మొదటిభార్య యీమధ్యనే పోయింది; ఆ విషయం నీకు తెలుసు. ఇంక మరెవరున్నారు గనక!"

"బాగుంది."

............

"రోజూ మనకి న్యూస్ పేపరు వస్తుందా."

"అది రాకపోతే ఎలాగ? మన వివాహానికి ముఖ్య కారణం అదేకదూ."

............

డిన్నరు పార్టీ అయి వారంరోజు లైంది. కమల అన్నయ్యా, అన్నయ్యతో వచ్చిన స్నేహితులూ వెళ్ళి పోయారు. నిరంజనం పంతులూ, కమలా మేడమీద గదిలో యీజీ చైర్లమీద కూర్చున్నారు.

"మనం యేవూరైనా వెళ్ళి తిరిగివస్తే బాగుండును" అన్నాడు పంతులు.

"ఎందుకూ?"

"హనీమూన్."

కమల నవ్వింది.

"ఎటు వెళదాం?"

"మీ యిష్టం."

"నువ్వే చెప్పు."

"కాకినాడ."

"బరంపురం వెళ్లొద్దూ?"

"ఆమాత్రందానికి నన్నెందుకు అడగాలి?"

"నువ్వు సరిగ్గా బరంపురమే చెప్తావనుకున్నా."

"బరంపురంలో ఏముంది గనక?"

"మరి కాకినాడలో ఏముందని చెప్పావు?"

"ముందు కాకినాడ వెళ్లి అక్కణ్ణుంచి తిన్నగా బరంపురం పోదాం."

"ఏం అంత తొందర?"

"బరంపురం వెళ్ళడానికి మీకంత తొందరేం?"

"అక్కడ పిల్లలున్నారు."

"ఆ... ఆసంగతి మొదటే చెప్పారుకారేం. మహా గొప్పవారు. మొన్న తీసుకురాలేకపోయారా?"

"ఇంకేనా అక్కడికి బయలుదేరుతావా?"

"అహా! కకినాడే."

"ఏం అంత తొందర?"

"అక్కడ నా పిల్ల లున్నారు."



# పెళ్లి చేసి చూడు!



'కాయా! పండా!'

'అదీ మనమే నిర్ణయించుకోవాలి'

'అంటే!'

"అంతా చెపుతాను. కాస్త కాఫీ కాచు. నీళ్లుతోడు స్నానం చేస్తాను... ఏం బస్సులు, ఏం రైళ్లు! ఊపిరి తీసుకుందుకైనా అవకాశం లేకపోయింది."

ఏభై అయిదు సంవత్సరాల జీవితంలోనూ ముప్ఫై సంవత్సరాలు ఉద్యోగానికి ధారపోసి యీమధ్యనే రిటైరయాడు గోపాలంపంతులు. చిన్నగుమస్తాగా ప్రవేశించి గెజిటెడ్ ఆఫీసరుగా రిటైరయాడంటే అతని సుగుణసంపత్తే అందుకు కారణం అని చెప్పుకోవాలి. పట్టభద్రులు కాక

పోయినా గోపాలంపంతులు మేధాసంపత్తినీ, సత్ప్రవర్తననీ మెచ్చి అతనికి ప్రమోషన్‌మీద ప్రమోషన్ యిచ్చారు, దొరలు. కాని చివరకాలంలో గోపాలంపంతులికి యెప్పుడూ తన పై అధికారులతో తగాదాలే. అందుకు కారణం అతను కచ్చితమైన మనిషి అవటమే. గోపాలం పంతుల్లో ఉన్న గొప్పలోపం ఏమంటే కాలంతోపాటు తనూ మారలేక పోయేవాడు. తన యథార్థవాదం, నిజాయితీ కొన్నాళ్ళ వరకూ కాపాడుకువచ్చిన మాట వాస్తవమే కాని, కాలం మారి కట్టుబాట్లు సడలిపోయి ప్రతివాడూ...బంట్రోతు మొదలు అతనికన్న పెద్ద ఆఫీసర్లవరకూ లంచానికి చెయ్యి చాస్తున్న రోజుల్లో గోపాలంపంతులు యదార్థవాదానికి విలువ లేకపోయింది. అందరిమల్లే ఆత్మను చంపుకుని చెయ్యి చాచలేకపోయాడు. ఈ పద్ధతిలో అతను చాలా చేతకాని వాడు అని అనిపించుకున్నాడు. తన కళ్ళముందు ఉద్యోగాలు సంపాదించుకున్న వాళ్ళూ, తనచేత్తో తనే ఉద్యోగాలు యిచ్చినవాళ్లూ, తనకన్న తక్కువ హోదాలో ఉన్నవాళ్లూ మేడలు కట్టిస్తూంటే తను పిత్రార్జితమైన యింటిని గట్టిగా మరమ్మత్తుచేయించుకుందికి కూడా తికాణా లేకపోయిం దంటే గోపాలం పంతులు ఎంత మంచివాడైనా అప్రయో జకు డని మనం అనేస్తాం.

తన పై అధికారిని పనితోటే సంతృప్తి పరచగలిగే వాడే గాని డబ్బు ఖర్చుపెట్టలేకపోయేవాడు. అది లోభ

త్వంచేత కాదు. తనతోపాటు నలుగురైదుగురు భోజనానికి లేస్తేనేగాని లేవని గోపాలంపంతుల్ని లోభి అని ఎలా అనగలం. కాని డబ్బు కావలసిన అధికారులకు గోపాలం పంతులు ఎంతపని చేస్తేమాత్రం ఏం లాభం! ఈ రకమైన లాంఛనాలు నిర్వర్తించకపోవడంవల్ల అధికారు లందరి దగ్గరా చెడ్డ అయిపోయాడు.

'ఇలా అయితే ఎలా గోపాలం! నాలుగు పైసాలు నువ్వూ ఎలాగో సంపాదించి ఖర్చుపెడుతూండాలి గాని అందరిదగ్గరా చెడ్డ అయిపోతే ఎలా?' అనేవాడు శాస్త్రి గోపాలంపంతులుతో.

'కాకుల్ని కొట్టి గెద్దలకి వేసేపద్ధతి నాకు నచ్చదు శాస్త్రీ! నువ్వేనైనా చెప్పుగాని' అనేవాడుగోపాలపంతులు.

చివరకి గోపాలంపంతులుమీద ఒకొక్కడు ఒక ఆయుధం ప్రయోగించే వెళ్ళేవాడు.

అతని ఉద్యోగజీవితం పూర్తయింది. ఇప్పుడు తన ఏకైకపుత్రికకు వివాహం చెయ్యవలసివచ్చింది. తగిన వరుని కోసం అన్వేషిస్తున్నాడు.

ప్రావిడెంటుఫండూ, కంపెనీల్లో భీమాచేసిన సొమ్మూ అంతా పదివేలవరకూ వచ్చాయి గోపాలంపంతులికి. ఒక్కగా నొక్క కూతురు కాబట్టి తగిన వరుడి కివ్వాలని గోపాలం పంతులు అభిలాష. కాని తనకి యిష్టమైనవాళ్ళంతా తన ఆస్తికి పైగా కట్నా లడుగుతున్నారు. ఈపరిస్థితుల్లో మనస్సు

కష్టపడినప్పుడు అనుకునేవాడు, "నేను నిజంగా అప్రయోజకుణ్నే" నని.

"నీళ్లు తోడేను రండి" అని కేక వేసింది భార్య.

స్నానంచేసి కాఫీ త్రాగి కూర్చున్నాడు.

"అయితే ఇంతకీ ఏ మైనట్లు?" అంది భార్య.

"ఏమైనట్లు? ఇది తప్పితే మనం యిక వివాహం చెయ్యలేం. అక్షరజ్ఞానం లేనివాడికైనా యీరోజుల్లో కట్నంకావాలి. కాలం అలా ఉంది. ఉద్యోగం చేస్తున్న న్నాళ్ళు కాలానికి కళ్ళేం వేశాను గాని యిప్పుడు లాభం లేదు. పెద్దకట్నాలు యివ్వకుండా సంబంధం చెయ్యలేం."

"ఆ రోజుల్లో నలుగురిమల్లే నాలుగు పైసాలు సంపాదిస్తే ఇప్పుడు పనికొచ్చేవా?"

"ఆ మాటలు మాను"

'ఎందుకు? అయినా చేతులు కాలిపోయిన తరువాత!'

'ఐదువేలు కట్నం, మిగతా లాంఛనాలూ, ఉభయ ఖర్చులూ'

"అబ్బా!"

"మరేం చేస్తాం?"

"నాకు పెళ్లొద్దు, నాన్నగారూ! పురుషుల్లో ఉన్న అహంకార శక్తుల్ని దుళ్ళకొట్టేవరకూ పెళ్ళి చేసుకోను." అంది అప్పుడే కాలేజీ నుంచి వచ్చిన కూతురు.

"నీ కింకా చిన్నతనం పోలే దమ్మాయి!"

"చిన్నతనం అంటారేమిటి నాన్నగారు! పురుషులు స్త్రీలమీద కక్ష సాధిస్తూంటే మేం ప్రతీకారం చూపొద్దూ?"

"ఆ కక్ష మీమీద కాదమ్మాయ్; మా మీదే. పురుషుల మీద పురుషులు."

"అది మానుంచేగా?"

"నిజమే. కాని బాధ్యత మాదేగా?"

"ఆ బాధ్యతనుంచే యికనుంచి మీరు తప్పుకోవాలి"

"ఎంత తేలిగ్గా అనేశావ్, అమ్మాయ్!"

"కాలం మారుతోంది, నాన్నగారు! దేశభవిష్యత్తును చూస్తూంటే స్వల్పభవిత్తులోనే స్త్రీలకికూడా పురుషులతో సమానమైన ప్రతిపత్తి వచ్చేటట్టుంది. అన్ని విషయాల్లోనూ స్త్రీలుకూడా ప్రధానపాత్ర వహించవలసి ఉంటుంది. ఇది చాలా అవసరంకూడా."

"నీకు పుణ్యం ఉంటుంది; ఈలాటి ఉపన్యాసాలకి స్వస్తి చెప్పు. నలుగురూ వింటే పెంకిపిల్ల అంటారు."

"యదార్థం చెపితే యింతే నాన్నగారు"

'నిజం. నేను యదార్థవాదినయే నిర్భాగ్యుణ్ణయ్యాను.'

'పోనీ ఒకటి ఆలోచించండి, నాన్నగారు! స్త్రీలకి పెళ్ళి ఎంత అవసరమో పురుషులకీ అంతే కద? అలాంటప్పుడు ఆడపిల్లలు కలవాళ్ళంతా కొన్నాళ్ళపాటు ఓపికపడితే కట్నాల అవసరం లేకుండానే అల్లుళ్ళు దొరకవచ్చు.'

'పురుషులు ఎన్నాళ్ళు వివాహం కాకుండా ఉన్నా పరవాలేదు గాని, యుక్తవయస్సులో ఉన్న స్త్రీకి వివాహం చెయ్యకపోతే లోకం విరుచుకు పడుతుంది.'

'స్త్రీలు కట్టుదిట్టంలో ఉన్నన్నాళ్ళు లోకం యెంత విరుచుకుపడితేనేం? మూఢవిశ్వాసాలతోనే మనం మాసిపోతున్నాం.'

'అంతకంతకి మీ చదువులన్నీ ప్రయోజనశూన్యమైన హేతువాదానికి దారితీస్తున్నట్టున్నాయి.'

'ఏమిటమ్మాయి ఆ వాదన? ఎవరైనా వింటే నవ్వుతారు. వెళ్ళి కాఫీ తాగు, వంటింట్లో మూతపెట్టాను.' అని గదమాయించింది తల్లి.

'పెళ్ళయ్యేవరకూ ఇలాగే కబుర్లు చెపుతారు. కాపురం చేస్తూంటే మనం జ్ఞాపకమే రాం...ఏం తల్లీ!' అన్నాడు గోపాలంపంతులు.

రూపసియైన అవబోయే భర్తను చూసేసరికి గోపాలం పంతులు కూతురు తన ఉపన్యాసాన్నంతా మరచిపోయింది. యౌవనం అలాంటిది.

వివాహం సలక్షణంగా జరిగింది. అందరు బంధువులూ వెళ్లిపోయారు. కుమార్తెను కూడా అత్తవారింటికి పంపేశాడు.

ఒకరోజున యిల్లంతా కలయచూసుకున్నాడు గోపాలంపంతులు. మరమ్మత్తుకోసం యిల్లు హెచ్చరిస్తోంది.

ఉన్న డబ్బంతా వివాహానికి ఖర్చయింది. వెర్రివాడల్లే యిల్లంతా తిరిగి కుర్చీలో కూర్చున్నాడు.

తోటిఉద్యోగులందరికీ పెన్షన్ కాక యిల్లు, భూములూ వగైరాలు మిగిలాయి. అందరికీ వచ్చే పెన్షన్ కాక తన కేమి మిగిలిందా అని ఆలోచించాడు,

మూలనున్న చింకిజోళ్లూ, నిరుపయోగంగా వేలాడుతూన్న టోపీలూ వెక్కిరిస్తున్నట్టయింది గోపాలం పంతులికి.

---

# క్రీనీడలు

శాంతిశూన్యమైన సీతారామయ్య హృదయంలో అప్పుడప్పుడు ఏవో ఆశారేఖలు మెరుస్తూంటాయి వాటిని చూసుకునే జీవితాన్ని అలా గడుపుకుని వస్తున్నాడు.

విరామం, విశ్రాంతీ లేని ఉద్యోగాన్నీ, అధికారగర్వాతిశయులైన అధికారుల్నీ, చెప్పినట్టు వినని కొడుకునీ, గయ్యాళి భార్యనీ తలుచుకున్నప్పుడల్లా సీతారామయ్య బ్రతికి ఉండడంకన్న చనిపోవడంలోనే ఎక్కువ సుఖం ఉందనుకుంటాడు. గాని సహజ మానవ బలహీనతా, అవ్యక్తపు టాశారేఖలు అతని మనోభిప్రాయానికి అడ్డుగా వస్తున్నాయి.

గొడ్డుచాకిరీ చేసి చివరికి నాలుగుచీవాట్లు అధికారుల చేత తిన్నా అవేనయం అనిపిస్తుంది సీతారామయ్యకి భార్య జ్ఞాపకం వచ్చినప్పుడు. చీటికీ మాటికీ చిరాకు తెచ్చుకుని గోరంతలు కొండంతలు చేసి విరుచుకు మీదపడే భార్యను చూసి గడగడలాడతాడు, పాపం! అతని పరిస్థితిని చూసి అంతా సానుభూతి చూపేవాళ్ళేగాని 'నీకిది తగదు' అని అతని భార్యదగ్గర అనే సాహసం ఆ సానుభూతిపరులలో ఒకరికీ లేదు.

ఇంత హీనంగానూ, దీనంగానూ బ్రతికేకన్న ఏ అడవికోపోయి ముక్కుమూసుకు కూర్చుంటే బాగుణ్ణను కున్నాడు చివరికి.

ఒకనాడు తెల్లవారుఝామున బయల్దేరాడు. ఊరూ, ఊరవతల దొరల బంగాళాలూ, వాటి తరువాత పొలాలూ గడచి నడచి పోతున్నాడు. నడచి నడచి చీకటి పడేదగ్గర ఆగిపోయాడు. అది అరణ్యం కాకపోయినా చుట్టుపట్ల చాలా దగ్గరగా ఏ ఊరూ, పల్లీ లేదు. చీకటి దట్టంగా ఉంది. నక్కలు అరుస్తున్నాయి.

గమనాయాసం, చీకటీ, ఆకలీ సీతారామయ్యని బాధిస్తున్నాయి. మహాంధకారం ఆవరించుకున్న ఆ నిర్జన ప్రదేశంలో సీతారామయ్యకి భయం వేసింది. ఇక్కడే యిలా ఉంది కదా యిక మహారణ్యంలోనికి వెళ్ళి ఎలా ఉండగలను. పులులూ, సింహాలూ, పాములూ, ఎలుగ్గొడ్లు, అమ్మ

బాబోయ్! అనుకున్నాడు. నక్కలు విజృంభించి అరుస్తు న్నాయి. సీతారామయ్య భయంతో గడగడలాడుతున్నాడు. ముచ్చెమటలూ పోశాయి. వెర్రో మొర్రో యింటిదగ్గర ఉంటేనే నయమనుకున్నాడు. కాని... ఆ ఆఫీసూ, ఆ బండపనీ ఆ గయ్యాళిభార్యా, ఆమె గర్జనలూ తిరిగీ అక్కడకే... గత్యంతరంలేదు. లేకపోతే యిక్కడ ఒక్కక్షణమైనా ఉండ గలనా...కదలే ఆకుకుకూడా త్రుళ్ళిత్రుళ్ళి పడుతున్నాడు. ఆ పరిస్థితిలో అతనికి నిద్దర ఏం పడుతుంది. క్షణ మొక యుగంలా ఎప్పుడు తెల్లవారుతుందా ఎప్పుడు యింటికి పోతానా అని చూస్తున్నాడు... రేపు సాయంత్రానికి కాని ఇంటికి పోలేను. యింటికి వెళ్ళగానే 'రెండు రోజులనుంచీ ఎటు పోయా'వని భార్య అడిగితే ఏం చెప్పడం? యదార్థం చెపితే దానిదగ్గర మరీ తేలిక ఐపోతానే! ఊళ్లోవాళ్లంతా— తనపై సానుభూతి చూపించినవారు కూడా—నోట్లో గడ్డి పెడతారే. ఇక ఆఫీసుకు వెళితే, అసలే మూలవ్యాధివాడు అధికారి. ఇక పిడుగులు వర్షిస్తాడు. శలవు పెట్టకుండా రెండు రోజులు పనిలోకి రానందుకు నిన్నెందుకు ఉద్యోగంనుండి తీసేయకూడ దని సంజాయిషీ అడుగుతే ఏమి టనడం. ఆలో చించి ఎంత తెలివితక్కువపని చేశా ననుకున్నాడు. ఏ మను కున్నా ఎంత విచారించినా గతించినదానికి ఏం చెయ్యగలం.

తెలతెల్లవారుతోంది. సీతారామయ్య యింటికి బయలుదేరాడు. అసలే అక్కుపక్షిలాంటి మనిషి. అందుకు

సాయం భోజనం లేదు. రాత్రల్లా నిద్దర లేదు నీరసంతో కాళ్ళు తేలిపోతూ ముందుకు సాగకుండా ఉన్నాయి.

ఊరు దగ్గరవుతున్నకొద్దీ గుండెలు గుభేలు మంటు న్నాయి. పర్యవసానాన్ని ఆలోచిస్తూంటే కాళ్ళు వెనక్కి లాగుతున్నాయి.

రాత్రి పదిగంట లయేసరికి యిల్లు చేరుకున్నాడు. యింటికి తాళం వేసుంది. భార్య ఏమైంది? ఎటుపోయింది. సీతారామయ్యకి మతిపోయింది. ఇరుగుపొరుగుల వాళ్ళని అడుగుతే బాగుణ్ణనుకున్నాడు కాని అంతాపడుకున్నారు. ఇప్పుడు గత్యంతరం ఏమిటి?

తన ఆఫీసులోనే గుమస్తా, తన హితాభిలాషి అయిన సుబ్బారావు యింటికి వెళ్ళాడు.

'ఎటుపోయావురా సీతారామయ్యా! నువ్వు పరారీ అయిపోయావని ఊరంతా గగ్గోలుగా ఉంది. ఆఫీసరు అగ్గవు తున్నాడు. నీభార్య బెంగపెట్టుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది. ఎటుపోయావురా?' అని సుబ్బారావు అడుగుతూంటే ఏం సమాధానం చెప్పాలో సీతారామయ్యకి తెలియలేదు.

భార్యను వెంటనే వచ్చేయమని ఉత్తరంవ్రాసి పడేసి ఆఫీసుకు వెళ్ళాడు. నాలుగు చీవాట్లతో ఆఫీసుగండం తప్పి పోయింది.

వారంరోజులైంది. భార్యా రాలేదు గాని భార్యకు జబ్బుగా ఉందనీ తనని వెంటనే రమ్మనీ ఉత్తరం వచ్చింది.

శలవుపెట్టి వెళ్ళాడు. భార్యకు చాలా సుస్తీగానే ఉంది. రోజుకు రోజూ రోగం వృద్ధవుతోంది కాని తగ్గుముఖం కన్పట్టడంలేదు. వైద్యులుకూడా సాయశక్తుల కష్టపడ్డారు. కాని రోగానికి మందుంటుందిగాని యోగానికి ఉంటుందా? పాపం సీతారామయ్యభార్య మరణించింది.

భార్యావియోగంతో మరీ క్రుంగిపోయాడు సీతారామయ్య. ఏకాకి ఐ మసులుకొస్తున్నాడు. కొడుకుయుద్ధంలో చేరిపోయాడు. భార్య మరణించింది. ఇల్లంతా బావురుమంటోంది. మసలడానికి భయం వేస్తోంది సీతారామయ్యకి. ఇతర దక్షత లేదు.

పాపం! సీతారామయ్య నిజంగా శాంతిశూన్యుడు. జీవితంతో పోట్లాడి మొండితేరిపోయాడు. భార్య ఎంత గయ్యాళిదైనా, కొడుకు ఎంతదుర్మార్గుడైనా వాళ్ళు ఉన్నప్పుడుండే ఆనందంలో వెయ్యోవంతు యిప్పుడు లేదనుకుంటూంటాడు. తన నీడనీ, క్రీనీడనీ చూసే యింట్లో మనుషులున్నారని కాలం గడుపుతువస్తున్నాడు. ఇంకా ఏ ఆశారేఖ అతన్ని కదలిస్తోందో.

లోకంలో సీతారామయ్యవంటి వ్యక్తులు వ్యక్తంగానూ, అవ్యక్తంగానూ లేకపోలేదు. వారినిచూసి సానుభూతి చూపడంకన్న మనం ఏంసహాయం వారికి చెయ్యగలం?



# జీవితం

పిల్ల చచ్చినా పురిటివాసన పోలేదన్నట్టు సూర్యారావుకి ఉద్యోగం పోయినా ఉద్యోగ కాలంలో అలవాటైన దురల వాట్లు మాత్రం పోలేదు. అఖండంగా ఐదు సంవత్సరాల పాటు వెలిగించిన చక్కని ఉద్యోగం అమాంతంగా పోయిన నాడు నూతిలో గెంతేదా మనిపించింది, సూర్యారావుకి. ఎంత గౌరవం, ఎంత హోదా, ఎంత పలుకుబడి! అన్నీ ఒక్కసారి మంట కలిసిపోయాయి. కేవలం తనవల్లనే ప్రజ లకి అన్నం దొరకుతోంది అని తనూహించుకున్న స్వర్ణ దినాలు గతించాయి. ఎంతమంది ప్రజలు రేషన్ కార్డు కోసరం తన యింటిచుట్టూ, ఆఫీసు చుట్టూ తిరిగేవారు! ఎంతమంది వర్తకులూ, వ్యాపారస్తులూ చిత్తం చిత్తం అనుకుంటూ తిరిగేవారు!

నూరు చీవాట్లు ఒక్క బొబ్బట్టుతో సమానం కావు అన్నట్టు తనకి వినీ, వినిపించకుండా ఎంతమంది కారుకూతలు కూస్తే తనకేం? తనకి రావలసిన నాలుగు పైసాలూ ఒచ్చి యింట్లో పడుతూంటే! ఏనుగ వెళుతూంటే వెయ్యికుక్కలు మొరుగుతాయ్ అనుకునేవాడు.

సూర్యారావు మొదట్లో చాలా బుద్ధిమంతుడు. ఎలాగో కష్టపడి శాస్త్ర చదువుకుని నిరుద్యోగి అయాడు. నిజానికి అతని వినయసంపత్తిని చూసే ప్రక్కయింటాయన

రేషన్ డిపార్టుమెంటులో ఉద్యోగం వేయించాడు. ఒక్క సంవత్సరం ఉద్యోగం చేసేసరికి సూర్యారావులో ఎంతో మార్పువచ్చింది. ఆ సంవత్సరంలో సూర్యారావు ప్రతి యింటికి వెళ్ళి మనుషుల్ని లెఖ్ఖ వెయ్యడం, కార్డులు వ్రాసి యివ్వడం, రేషన్ షాపులూ, కాఫీహోటేల్లూ తనిఖీ చేయడం, బియ్యంబస్తాలు మంజూరు చెయ్యడం, మొదలైన అన్ని ఉద్యోగాలూ చేశాడు. నలుగురితోనూ పరిచయం అయింది. ఎవరితో ఏ విధంగా మాట్లాడాలో నేర్చుకున్నాడు. తనంతట తాను అడక్కుండానే నాలుగుపైసాలు జేబులో పడే చాకచక్యాన్ని నేర్చుకున్నాడు. "మీ యింట్లో తక్కువ మనుషులున్నారే, రేషన్ కార్డులో ఎక్కువమంది ఉన్నారు, కేసు పెడతా" నని ప్రజల్నీ; "బ్లాక్ మార్కెట్ చేస్తున్నట్టు నాకు తెలియకపోలేదు, ఆ లాభంలో వంతు పెట్టకపోతే షాపు నిలవదు" అని వ్యాపారస్తుల్నీ బెదరించేసరికి నాలుగు రాళ్లు రావడంలో అభ్యంతరం ఏముంది? క్రమేణా సూర్యారావుకి బియ్యం కొనుక్కోవలసిన అవసరంగానీ, కాఫీహోటల్‌కి వెళితే డబ్బు యిచ్చుకోవాలన్న బాధగానీ లేకపోయింది.

రెండు సంవత్సరాలు గడచేసరికి ఊళ్లో పెద్ద మొనగాడై పోయాడు. చిన్నచిన్న వాళ్ళని లెఖ్ఖచెయ్యడం మానేశాడు. హేటూ, బూటూ, సూటూ వేశాడు. అలాంటి వాళ్ళతోనే తిరుగుతూండేవాడు. క్లబ్లీ, సిగరెట్లు, పేకాట

దగ్గరనుంచి స్పెన్సర్ కి వెళ్ళి బీర్ బుడ్డీ విప్పేదాకా వచ్చాడు. అయినా భార్యకి నగలూ, నాణెలూ చేయించకపోలేదు. చక్కటి మేడ కట్టిద్దామనుకున్నాడు కాని లోకానికి భయపడి ఆ ప్రయత్నంనుంచి విరమించుకున్నాడు. ఇలాంటి పరిస్థితులలో అతని ఉద్యోగం కాస్తా ఊడిపోయింది; ఉద్యోగం లేదు. ఉద్యోగకాలంలో సంపాదించుకున్న నాలుగుపై సాలూ పూర్తిగా ఖర్చయాయి. పైనుంచి పైసా రాకపోయినా నిత్యజీవితావసరాలు తప్పుతాయా! పైగా వ్యసనాలు. భోజనం లేకపోయినా ఉండగలడుగాని వ్యసనాలు ఊరుకోనిస్తాయా? భార్య నగలన్నీ అమ్మేశాడు. నూటు మారిపోయి సాదాపంచలుదాకా వచ్చింది. సంసారం గడవడం కష్టంగా ఉంది. మనోవ్యాధితో పిచ్చివాడల్లే తయారయాడు.

తన వెనకాల ఏ వ్యాపారస్తులు చిత్తం చిత్తం అనుకుంటూ తిరిగేవాళ్లో వారి దగ్గరికి వెళ్ళి ఏదైనా ఉద్యోగం యిమ్మని ప్రార్థిస్తే వారే ఎంతో హేళనగా మాట్లాడేవారు. ఇప్పుడు సూర్యారావు దగ్గర వాళ్ళెందుకు భయపడాలి! అతని పరిస్థితి చూసి సానుభూతి చూపేవాళ్ళ కన్న నవ్వేవాళ్ళే ఎక్కువయారు. 'అయిందిరా అయ్యగారి ఉద్యోగం. ఇప్పుడైనా నెత్తిమీది కళ్ళు క్రిందికి దిగుతాయేమో' అని అతని ముఖం ఎదుటే అనేవారు.

భార్యను పంపించమని ఎన్నిసార్లు ఉత్తరాలు వ్రాసినా జవాబివ్వని సూర్యారావు, "మీ కూతురు మిమ్మల్నందర్నీ

చూడాలని ఎంతో ఆత్రుత పడుతోంది. మీరు వచ్చి తీసుకు వెళ్ళవచ్చు" నని ఉత్తరం వ్రాసేరు, మామగారికి.

వారంరోజుల్లో మామగారు వచ్చారు. అల్లుడికి ఉద్యోగంపోయిందన్న విషయమే తెలుసుగాని వారి ప్రస్తుత పరిస్థితి ఇంత అధ్వాన్నంగా ఉందని సూర్యారావు మామ గారికి తెలీదు. ఇల్లు అద్యువారి సట్టిల్లులావుంది. కూతురు వల్ల మెల్లగా పరిస్థితి తెల్సుకున్నాడు. తెలియనివాళ్ళదగ్గర గౌరవమర్యాదలు పోయినా ఫరవాలేదుగాని, తెలిసినవాళ్ళ దగ్గర - అందులోను బంధువులదగ్గర - హీనంగా కనిపించ డం ఎవరికైనా నికృష్టంగానే ఉంటుంది. సూర్యారావుకి ప్రాణాలు పోయినంత యిదిగా ఉంది.

సరిగ్గా ఆపూటకే బియ్యం నిండుకున్నాయి. ప్రక్క యిళ్ళల్లో అప్పు పుట్టలేదు. సూర్యారావు భార్య కళ్ళంట నీళ్ళు తిరుగుతున్నాయి; అంత కంట్రోలు రోజుల్లోనూ ఏ క్షణంలో చూసినా బస్తాబియ్యానికి తక్కువలేకుండా ఉండే ఇంట్లో బియ్యం లేకపోయాయి. అది చూసి సూర్యారావు భరించలేక పోయాడు. ఇక మామగారికి ముఖం చూపించే కన్న చనిపోవడం మేలనుకున్నాడు.

'మీ నాన్నతో వెళ్ళిపో, తిరిగీ ఉద్యోగం సంపా దించుకుని నిన్ను తీసుకువస్తా' నని భార్యతో చెప్పి వెళ్ళి పోయాడు.

# సలహా

రూపలావణ్య విభ్రమ విలాసాలతోనూ, నర్తన ప్రవర్తనలలోనూ మిన్నయైన తటిల్లతా దేవి గానంలో కూడా అందెవేసినచెయ్యి. నేలమీద కూర్చునే ప్రేక్షకుడు మొదలు దేశంలో అన్నివిధాలా పెద్దవారనిపించుకున్నవారి వరకూ ఆమె పేరు ప్రఖ్యాతులు తెలుసు. ఆమె ప్రొడ్యూసర్లకి మూలధనం. డైరక్టర్లకి పలవరింత. ప్రేక్షకులకి మత్తుమందు. తారాపథంలో ఆమె ధృవతార. ఆమె యశశ్చంద్రికలు హిమవన్నగము కన్న ఉన్నతములై మిన్నుముట్టుతున్నాయి. ఆమె మిస్ అవటం నిజంగా దేశం యొక్క అదృష్టం. ఆమె నివాసం 'స్వర్గవిలాసం' లో సింహద్వారంవద్ద పహారావారు కూడా ఉన్నారు. తరచూ ఎవరితోనూ మాట్లాడకుండా ఉండాలని ఆమె ప్రయత్నం. కాని యీ పత్రికారచయితలూ, స్నోలూ, సబ్బులూ, కాసననూనెల కంపెనీవాళ్లూ, ఇన్సూరెన్సు కంపెనీ ఏజంట్లూ ఆమెని బ్రతకనిస్తారా?

'మీ జీవిత రహస్యాన్ని కాస్త తెలియజేస్తే స్వర్ణాక్షరాలలో వెండిపుటలమీద అచ్చువేయించి ప్రతినక్కంటికి నూరురూపాయలకి అమ్ముతాం ఏమంటారు?'

'మీ జీవితపర్యంతం సరిపోయే స్నోలూ, సబ్బులూ, తలనూనెలూ యిచ్చేపూచీ మాది. మీ అభిప్రాయాన్ని కాస్తయిస్తే'

'అధమం తమవంటి వాళ్ళు లక్షరూపాయలకైనా భీమా చేయించడం మంచిదంటాను. ఇతరుల కెవరికీ లేనటు వంటి సదుపాయాలు మీకు చేయించే పూచీ నాది. అంతే ఏమిటి! మా బోర్డాఫ్ డైరెక్టర్స్‌లో మిమ్మల్ని వేయించ కుండా ఊరుకుంటానా.'

... మొదలైన వన్నీ ఆమె తరుచూ వినే మాటలు.

'ఫలానా నిధికి మీరొక వెయ్యి రూపాయలు సహా యం చెయ్యాలి' అంటూ వచ్చే వాళ్ళకు లెక్కలేదు.

చివరికి ప్రజలంతా ఏం అభిప్రాయపడ్డారంటే – ఇక ఆమె లేకపోతే యీ ప్రపంచమే లేదనీ, ఆమెకన్న గొప్ప తార ప్రపంచంలో లేదని...

ఇంతెందుకు ఆమె లేకపోతే జీవితమే లేదు, ఫిల్మ్ సంస్థే లేదన్నారు, చలనచిత్ర నిర్మాణకర్తలూ, భర్తలూ.

ఇలాటి పరిస్థితుల్లో హఠాత్తుగా తటిల్లత అతిరహ స్యంగా పలాయనం చిత్తగించింది.

ఈ సంఘటన ప్రజల కేమీా అర్థం కాలేదు. ఇందు లోని ఆంతర్యం ఏమా అని పరిశోధనలు సాగిస్తున్నారు. నిరుద్యోగు లందరికీ యిదో ఉద్యోగ మైంది. ప్రొడ్యూసర్లూ, డైరక్టర్లూ ముఖాలు వేల వేశారు.

తటిల్లత బాల్యజీవితగాథ మనకు అనవసరం గాన దానిని వివరించ లేదు. తరువాత ఆమె యావ్వనాన్ని చూసి విభ్రాంతి చెందిన సుప్రసిద్ధుడునూ, సిద్ధహస్తుడునూ, హాస్త

లాఘువృడునూ ఐన ఆదర్శ దర్శకచూడామణి ఆమెని వెండి తెరమీద కెక్కించి కనకాభిషేకం చేయించిన సంగతి సువిదితమే. ఆమె తెరమీద జీవితం కూడా అందరకూ తెలిసినదే.

ఇప్పుడు అందరకూ వాంఛనీయమైనది ఆమె అంతర్థానంలోని అంతరార్థం.

దిన వారాలూ, నెలలూ గడచాయి. తటిల్లతని మరచి పోయేందుకు కొద్దికొద్దిగా అలవాటు పడుతున్నా రందరూ.

అలాటి సమయంలో ఒక సరిక్రొత్త నటీమణి పట్నం వచ్చింది. దర్శకుల్ని సందర్శించింది. ఆమెలో తటిల్లత పోలికలు కన్పట్టంచేత ప్రాచీనస్మృతులు ఊహాపథాల్లో రేగిన ప్రబుద్ధులు తటిల్లత నీ కేం అవుతుందని అనకుండా ఉండలేక పోయారు. మా అక్క అంది. వెంటనే పాత్ర దొరికింది.

తటిల్లత వివరాల్ని అన్వేషిస్తున్న పరిశోధకులు యీమె చుట్టూ మూగారు. ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపిస్తున్నారు.

"మీకు స్వయంగా అక్కయ్యే అయినప్పుడు ఆమె సంగతి మీకు తెలియకపోవడం వింతగా ఉంది."

"మా అక్కయ్య సినీమాల్లో చేరినప్పటినుంచి మాకు ఒక ఉత్తరమేనా వ్రాయలేదు ఒక సంవత్సరం క్రిందట మాత్రం స్విట్జర్లాండు వెళుతున్నానని వ్రాసింది. నాకు తెలిసినవిషయం అంతే.'

మిస్ తటిల్లత స్విట్జర్‌లాండులో ఉందని పెద్ద అక్ష రాలతో ప్రకటించాయి పత్రికలు.

ఒక్క సంవత్సరంలో చెల్లెలుకూడా పెద్దతార అయి పోయింది. పత్రికా రచయితలూ, భీమాకంపెనీ ఏజంట్లూ, స్నో, హెయిరాయిల్ కంపెనీవాళ్ళూ యీమె దగ్గరకీ వస్తున్నారు.

ఒకనాటి సాయంసమయం. ఒక స్నో, హెయిరాయిల్ కంపెనీవాడు ఆమె యోగ్యతాపత్రానికి ప్రాధేయపడు తున్నాడు. ఆమె మురిపిస్తోంది. ఇంటర్ వ్యూకి వచ్చిన ఒక సినీఫాన్ వెయిటింగ్ రూములో కూర్చున్నాడు. ఇంతలో పోస్టుమాన్ ఉత్తరం తెచ్చాడు. ఆమె ఉత్తరం చదువు కుంది. మరోకసారి చదువుకుని ప్రారంభించింది పెద్ద గొంతు కతో 'నీ స్నోలూ నీ వాసననూనెలూ నా కక్కరలేదు. పో! వెళ్ళిపో! ఒక్కక్షణం ఇక్కడ ఉండకు." ఆ కంపెనీవాడికి ఏం అర్థమవలేదు. యోగ్యతాపత్రం అందుకోబోయే సమయంలో కథ అడ్డం తిరిగింది.

'ఊ! కదలవేం' రాక్షసిమల్లే గర్జించింది. ఏదో ప్రమాదం వచ్చిందని సినీఫాన్ పరుగెత్తుకు వచ్చాడు.

శ్రుతి మించిందని స్నోవాలా దారితీశాడు.

'రేపటినుంచి వీళ్ళను రావద్దని బోర్డుకట్టెయ్యాలి' అంది.

'ఈ ఉత్తరం చూడండి'

'చెల్లెలికి వ్రాయించినది — నీ పేరు ప్రఖ్యాతులు విని చాలా సంతోషించాను. ఇంకా కీర్తి గడిస్తావని ఆశిస్తాను. స్వానుభవం మీద ఒక్క సలహా చెపుతున్నా. దాన్ని పాటించు. యోగ్యతాపత్రాల కోసం నిన్ను వేధించి నీకు సోప్లూ, తలనూనెలూ ఎన్నో కంపెనీల వాళ్ళు యిస్తారు. అవన్నీ రాసుకోబోకు. అవన్నీ రాసుకుని రంభా ఊర్వశుల తలదన్ని తాటి ప్రమాణం లేవాలనీ, హాలీవుడ్ తారలు నన్ను చూసి తలలు వొంచుకోవాలనీ, జగదేకతారను నేనే అనిపించుకోవాలనీ, యిరవై నాలుగ్గంటలూ అదే పనిగా సోప్ పూతపై పూత పూస్తూ నూనెమీద నూనె రాస్తూ ఒక ప్రభాతాన అద్దం చూసుకునే సరికి 'పూతన నేనే' అనిపించింది. కేశాలు నెరసిపోయాయి. ముఖం వికృతమైంది. అద్దం గిరవాటు వేశాను. ఎవరికీ తెలియకుండా బొంబాయి వచ్చా. అక్కడ చర్మరోగ వైద్యనిపుణులచేత చికిత్స చేయించుకున్నాను. లాభం లేకపోయింది. స్విట్జర్లాండు పొమ్మన్నారు. ఇక్కడకు వచ్చేశాను. ఇంకా చికిత్స పొందుతున్నాను.

గ్రహించు,

తటిల్లతా నిషాని.

---

# సానుభూతి

ఇంట్లో కూర్చుని ఎనిమిదో ఎక్కం చదువుకుంటోంది లలిత. తల్లి చెరువుకి వెళ్ళింది స్నానానికి. ఎంచక్కా లక్క పిడతలు పెట్టి పొరుగింటి చిట్టిపిల్లతో ఆడుకోకుండా తన్ని యింట్లో కుక్కలు రాకుండా చూడమని చెప్పిపోయింది తల్లి. తల్లిదగ్గర భయంచేతో లేక యింటిమీద కాపీర్ణం చేతో మహా బుద్ధిగా కూర్చుంది. ఇంతలో ముష్టిదాసరి వచ్చాడు—గుండారుపంచా, పైమీదో ఉత్తరీయం, ఒక చేత్తో విసన కర్రా, మరోచేత్తో వంకలు తిరిగిన వెదురు కర్రా, మెళ్ళో తులసిపూసలూ, నుదుట త్రినామాలూ, కుడి చెవి సందులో తులిసిదళం, చిన్న తలకట్టూ దానిమీద ఎర్రగా మెరుస్తున్న పెద్ద రాగిచెంబూ - ఈ వేషాన్ని చూసి మొదటి రోజుల్లో లలిత భయపడింది కాని అంతకంతకి చనువై అప్పుడప్పుడు వచ్చి పాడుతున్న పాటలు వింటూ ఆనందించేది;

దాసరి పాట వినగానే ఎక్కాలపుస్తకం ఒకమూల విసిరేసి గబగబ వీధిలోకి వచ్చేసింది.

"అమ్మా బియ్యం వెయ్యవ్" అన్నాడు దాసరి.

"ఓయ్! ఒయ్! ఒక్కపాట పాడవూ"

పాడతానంటూ భజగోవింద శ్లోకాలు ఆరంభించాడు.

లలిత బుద్ధిగా కూర్చుని వింటూ, ఏదో తెలిసినట్లు

బుర్ర తిప్పుతూ, దాసరిచేతులు తిప్పుతూంటే తనూ చేతులు తిప్పుతూ, మధ్యమధ్య చప్పట్లు కొడుతూ, అప్పుడప్పుడు భజగోవిందం అంటోంది.'

ఇలా దాసరిపాటలో తన్మయత్వం పొందిన లలితకి "ఔనే లలితా! ఇంట్లో ఉండమంటే ఎటుపోతూవే! అదేం కాళ్ళో ఒక్కక్షణం నిలవ్వు. అయ్యయ్యో! వెధవతుక్క యింట్లో దూరింది. ఛీ! ఛీ!!" అని గర్జిస్తున్న తల్లి ఆటంకమైపోయింది. గబగబ ఇంట్లోకి పోయింది.

ఆ గాలి తనమీదికి తిరుగుతుందేమో నని దాసరి బియ్యంమాట మరచిపోయి చల్లగా జారిపోయాడు.

ఆ తప్పుకి నాలుగు చీవాట్లుమాత్రం తగిలేయి లలితకి. తల్లి మడిలో ఉండబట్టి దెబ్బలు తగల్లేదుకదా అని సంతోషించి మూలనున్న ఎక్కాలపుస్తకం తీసి మళ్ళీ కూర్చుంది బుద్ధిగా.

తర్వాత అప్పుడప్పుడు దాసరి వస్తూండేవాడు. పాట విని ఆనందించి యథోచిత సత్కారం చేస్తూండేది లలిత.

ఇంతలోనే తల్లితో కూడా తాతగారింటికి వెళ్ళింది. అక్కడ కూడా దాసర్లు వచ్చేవారు. వాళ్ళచేత కూడా లలిత పాడిస్తూండేది కాని వాళ్ళపాట అంతగా నచ్చలేదు.

"భజగోవిందంపాట రాదూ" అని అడిగేది. వాళ్లూరుకునేవారు.

"మా వూళ్ళో మాంచిదాస రున్నాడు. బాగాపాడ తాడు. మీకు తెలుసునా అతన్ని" అనేది.

ఆ దాసరి చాలా మంచివాడనీ, చాలాపాటలు బాగా పాడతాడనీ లలిత అభిప్రాయం.

ఆ భజగోవిందశ్లోకాలు విందామని ఉండేది కాని యెవరికీరాదు. మళ్లా వాళ్ళూరు పోతే బాగు ణ్ణనుకుంది.

ఒక నెల పోయాక లలితా, తల్లీ వాళ్ళూరు వెళ్ళి పోయారు.

రోజూ ఆదాసరికోసం చూస్తూండేది. కాని ఆదాసరి రాలేదు. ఒకనాడు ఒకకుర్రదాసరి మాత్రం వచ్చి బియ్యం వెయ్యమన్నాడు లలితని.

"పాటపాడితే బియ్యంవేస్తా" నంది,

"పాటలురాకపోతే బియ్యం ఎవరువేస్తా" నంది మాటి తిప్పుతూ. కుర్రదాసరి మాట్లాడలేక పోయాడు.

"పోనీ. భజగోవిందంపాటలు పాడుతూంటాడు, ఆ పెద్దదాసరి నీకు తెలుసా ?"

"ఆ ! మానాన్న"

"అత నెందుకు రాలేదు ?"

"చచ్చిపోయాడు"

"అయ్యో ! పాపం ! రామ ! రామ !" అంటూ ఒక పిడికెడు బియ్యం తెచ్చివేస్తూ "మీ నాన్నొస్తే ఇంకా బియ్యం యిద్దు" నంది.



# నవ్వే పువ్వులు

రెండు వేడిహృదయాల మధ్య నలిగిన కుసుమాలు వాడి వాసన వీడి వెలవెల పోతున్నాయి. కిటికీ రెక్కల్లోంచి లేత సూర్య కిరణాలు కనకాంగిని తట్టి లేపుతున్నాయి. నిద్రమత్తులో తెలివితెచ్చుకుని బద్ధకంగా ఒళ్లు విరిచింది. నలిగిన సంపంగి పువ్వులు జడముడిలో నుంచి రాలిపోయాయి. కనకాంగి కళ్ళుమూసి ఒళ్లు విరిచి ఆవలించింది. కళ్ళు నులుపుకుని లేచి ఎదురుగా ఉన్న శ్రీకృష్ణుని పటానికి నమస్కరించింది, పక్కనున్న నిలువుటద్దంలో తన ప్రతి బింబాన్ని చూచుకుంది. ఏదో అసహ్యత లోన ఆవరించి చరచరా వెళ్ళిపోయింది.

ముసలమ్మ తెచ్చిన కాఫీ త్రాగి పడకకుర్చీలో కూర్చుంది. రాత్రి తా ననుభవించిన బాధా యాతనా స్ఫురించాయి. ఒళ్ళునొప్పి, కళ్ళమంట, కాళ్ళపీకు, శరీరాన్ని ముద్దచేసినట్టు - ఏవో బాధలు. జీవితంలో అనుభవం లేని బాధలు. ముసలమ్మను కేక వేసి మరోకప్పు కాఫీ తెప్పించుకుని త్రాగింది. నిలువుటద్దంలో తిరిగీ తన ప్రతిబింబాన్ని చూచుకుంది. ఏదో నీరసం. ముఖకమలంలోని జీవకళలు పోతున్నాయా అనే భ్రమ. అద్దంముందు మరి నిలబడలేక పోయింది. అతి నీరసంగా వచ్చి కుర్చీలో పడ్డది.

గతించిన గాథల్ని సింహావలోకనం చేసుకునేసరికి కనకాంగికి ఆశ్చర్యం వేసింది. భయంతో కూడిన ఆశ్చర్యం. తొల్లిటి రోజుల్లోని ఉత్సాహం, ఉద్రేకం, సౌందర్యం, తళతళ ఏమయాయ్? నిరుత్సాహంతో కళ్లు జిగ్గుమన్నాయి. ఫెడీమని లెంపకాయ కొట్టినట్టయింది.

మానవ హృదయాల లోతుల్ని, ఆరు సంవత్సరాల నుంచీ చూస్తోంది. ఎంత మందినో తనముందు ఆడించి ఆడించి బుట్టలో వేసి విసిరేసింది. గజ్జె కట్టి నాట్యమాడి రూపాయల గలగలతో పెట్టెలు నింపుకుంది. కాని యీ విధంగా యెప్పుడూ వ్యాకుల పడలేదు.

గతించిన రాత్రి సంఘటనే కనకాంగి హృదయంలో కల్లోలం. సాయంకాలం బాగా అలంకరించుకుని వీధి గుమ్మానికి ఆనుకుని నిలబడింది. ఒక పఠాన్ సైనికుడు—వస్తాదు లాంటి వాడు—బాగా కండలు తిరిగినవాడు—కనకాంగిని చూశాడు. చూపులతో ఆహ్వానించింది కనకాంగి. అందుకే అతడూ వచ్చింది. వెళ్ళాడు. ఆమె సౌందర్యాన్ని పీల్చి పిప్పిచేశాడు. డబ్బు అడిగేసరికి చితుకగొట్టి వెళ్ళిపోయాడు.

కనకాంగి ఓడిపోయింది. తల పోయినంత అవమానం. తలయెత్తుకు తిరగడానికి ప్రాణాలు పోతున్నాయి. తన వృత్తి మీద విపరీతమైన రోత పుట్టింది. జీవితంమీద విరక్తి పుట్టింది, యిక ఏమైనా ఆ వృత్తివల్ల జీవనం గడపకూడదని

నిశ్చయించుకుని భావిజీవిత నిర్వహణానికి పునాదులు త్రవ్వుతోంది. ఇంతలో కనకాంగి అన్న తూలుకుంటూ తూలుకుంటూ వచ్చి వందరూపాయిలు కావాలన్నాడు. పరమ త్రాగుబోతు. జూదగాడు. డబ్బు అవసరం వచ్చినప్పుడల్లా చెల్లెలు దగ్గరకు వస్తాడు. చెల్లెలు డబ్బు యివ్వకపోతే బాకు తీస్తాడు. వాడి బాధ పడలేక అడిగినంతడబ్బూ యిస్తుంది కనకాంగి. వాడే లేకపోతే కనకాంగి యీపాటికి కనక హార్మ్యాలు కట్టించేది అనేవారు. నిజం కూడా అంతే. అన్నయ్య హుంకరించాడు. కనకాంగి తాళాలు విసిరింది. పెట్టె ఉత్తరిచేసి జేబు నింపుకుని అతి వినయంగా తాళాలు యిచ్చేశాడు.

'అన్నయ్యా' అంది

వెళుతున్న వాడు తిరిగి వచ్చి చెల్లెలు దగ్గర నిలుచున్నాడు.

'రేపటినుంచి మరి డబ్బుకోసం మాత్రం రాకు' అంది.

'ఏం' అన్నాడు గట్టిగా.

'ఈరోజుతో యీ వృత్తి మానేస్తున్నా.'

'అంత ప్రమాదం ఏం వచ్చింది ... నన్నే మాయ చేద్దామనుకుంటున్నావా పిచ్చిదానా !'

కనకాంగి ఏడుస్తూ కూర్చుంది.

'నాకు తొందరగా పనుంది. తిరిగీ వస్తాలే' అనుకుంటూ వెళ్ళి పోయాడు.

'జ్ఞానంలేని మనిషి. ఉత్తపశువు' అనుకుంది కనకాంగి.

మూడుగంట లైంది. కనకాంగి భోజనం చెయ్య లేదు. ముసలమ్మ రెండుమూడుసార్లు వచ్చింది. కాని లేప టానికి ధైర్యం చాలక వెళ్ళిపోయింది. తిరిగీ ముసలమ్మ వచ్చేసరికి కనకాంగి లేచికూర్చుంది.

'లే అమ్మా ఒక్క మెతుకు తిందుగాని'

'కొద్దిగా కాఫీ చేసి తీసుకురా'

ముసలమ్మ కదల్లేదు.

'ఏమి టాలోచిస్తున్నావు ?'

'కాఫీగుండా, చక్కెరా రెండూ నిండుకున్నాయి. యింకా...

'బియ్యంకూడా అయిపోయాయి. ఈరోజుతో వారం ఆఖరు !

కనకాంగి లేచి పెట్టెతీసి చూచింది. ఒక్కదమ్మిడీ కూడా లేదు. చాలా విచారించుకుంది.

సాయంత్రం అయింది. మరునాటి భోజనానికి ముస్తాబై వీధిగుమ్మందగ్గర నిలుచోక తప్పిందికాదు, కనకాంగికి.

రెండు వేడిహృదయాలమధ్య నలగడానికి సిద్ధంగా ఉన్న కుసుమాలు వికటమందహాసాలు చేస్తున్నాయి.



# పిల్ల నచ్చింది



ఆ సన్నటి పొడుగాటి వేళ్ళు వీణాతంత్రులమీద అతి తొందరగా నాట్యం చేస్తూంటే కుటుంబరావుకు ఎవరో తన నరాలు పట్టుకు లాగుతున్నట్టనిపించింది. నాగస్వరం వింటూన్న పాముల్లే ఆ అమ్మాయి గానంతో తన్మయత్వం పొందాడు.

అమ్మాయి గానం ఆపడంతో కుటుంబరావు మామూలు ప్రపంచంలో పడ్డాడు. అమ్మాయిని చూచాడు. ఆమె విశాల నేత్రాలూ, గులాబీ చెక్కిళ్లూ, మల్లె మొగ్గ లల్లే పలువరుసా అతన్ని ఆకర్షించాయి. మొత్తానికి అమ్మాయి బాగానే ఉందనుకున్నాడు. అతని హావభావాల్ని గమ నిస్తూ అమ్మాయి తల్లిదండ్రులూ, కుటుంబరావుతో వచ్చిన స్నేహితుడూ, కుటుంబరావుకి పిల్ల నచ్చింది అని స్థిర పరచు కున్నారు.

"ఇంటికి వెళ్ళి జాబు వ్రాస్తాం" అంటూ కుటుంబ రావు స్నేహితుడు, అమ్మాయి నాన్నగారితో చెప్పి కుటుంబరావుతో కూడ బయలు దేరాడు.



"పిల్ల నచ్చిందిరా?" అన్న ప్రశ్నకి "ఆఁ" అన్న జవాబు వచ్చే సరికి కుటుంబరావు తల్లికీ, తండ్రికీ పట్ట

రానంత ఆనందం కలిగింది. ఆ మాట కుటుంబరావు నోటి వెంట ఎప్పుడైనా వస్తుందా అని ఎంతో కాలంనుంచీ ఎదురు చూస్తున్నారా ముసలి దంపతులు. అసలు మొన్న మొన్నటి వరకూ పెళ్ళి చేసుకునేందుకే అతను యిష్టపడ లేదు. దానికి తగిన కారణం లేకపోలేదు. తన తమ్ముడు కూతుర్నిచ్చి కుటుంబరావుకి పెళ్లిచేద్దామని కుటుంబరావు తల్లి ఉద్దేశం. తండ్రికూడా "మేనరికం చేసుకుంటే మంచిదే" అనేవాడు. కాని కుటుంబరావుకి, ఎంతమాత్రం యిష్టంలేదు 'ఆ కూరుపిని—స్ఫోటకపు చింత మొద్దునా పెళ్ళాట్టం!" అను కునేవాడు. అందువల్ల తల్లిదండ్రులవద్ద భయంచేతనయితే నేం, లేక సిగ్గుచేతనయితేనేం ఆ విషయం చెప్పలేక అసలు పెళ్ళే చేసుకోననేవాడు. తరువాత ఉద్యోగం ఖాయం అవాలనీ, యిలా వాయిదాలు వేస్తూ వేస్తూ చివరకు వాయిదాలు వెయ్యలేని పరిస్థితిలో పడ్డాడు. తల్లిదండ్రులు ఎప్పుడూ అదేమాట పట్టుకున్నారు. చివరకు ఒకనాడు తన మిత్రుడిద్వారా తాను మేనరికం చేసుకోనని తెలియజేశాడు. తల్లీ దండ్రీ కొద్దిగా విచారించినా కొడుకు తలమీద నాలుగు అక్షతలు వేయటంకన్న యీజన్మకింకేం కావాలనుకుని పై ప్రయత్నాలకు ఉపక్రమించారు.

"మీరు కూడా ఒకసారి పిల్లని చూచిరావటం మంచిది." అన్నాడు కుటుంబరావు స్నేహితుడు.

"నే మెందుకు బాబూ! పెళ్ళాడి పోషించవలసిన వాడు వాడు. వాడికి నచ్చాలిగాని..." అన్నారు కుటుంబ రావు తల్లిదండ్రులు.



కట్నాలూ, కానుకలూ, లాంఛనాలూ, వాంఛి తాలూ, వగైరా విషయాల్లో ఒప్పందల అయాక ఉభయ పక్షాలవారూ ఒక సుముహూర్తాన పెళ్ళిచేయడానికి నిశ్చ యించారు. సుభలేఖలు నాలుగుదిక్కులా ప్రయాణం చేసి నయ్.



శుభలేఖ చూసిన తరువాత జానకిరామయ్య మనస్సు చివుక్కు మంది. ఈవిషయం తెలిశాక అతనిభార్య చీద రించుకుంది. కూతురు చిన్నబోయింది. మేనల్లుడు తన్నిలా పరాభవిస్తాడని ఎప్పుడూ అనుకోలేదు, జానకిరామయ్య. 'బాహ్య సౌందర్యాన్ని చూసి మోసపోవడం నేటి యువకు లకి పరిపాటైంది' అనుకున్నాడు.



వైభవోపేతంగా జరిగిన వివాహ మహోత్సవంలో సకుంటుంబముగా వచ్చిన జానకిరామయ్యకూడా ప్రముఖ పాత్ర వహించి, ఏ కోపం లేకుండా, దిగ్విజయంగా వివా హాన్ని చేయించాడు. అతను చూపించిన శ్రద్ధకీ, అభిమానా నికీ కుటుంబరావుకి చిన్నతనం వేసింది. తన మేనమామ

యింత యిదిగా సహాయపడతా డని కుటుంబరావు అనుకో లేదు. జానకిరామయ్యని అంతా ఎంతో ప్రశంశించారు.



సంసారిక రంగంలో తమతమ పాత్రల్ని పూర్తిగా అర్థం చేసుకుని, ఏవిధమైన ఎగుడుదిగుళ్ళూ లేకుండా జీవిస్తున్నారు కుటుంబరావూ, భార్యా.

కాని ఒక సంవత్సరం తర్వాత జరిగిన విషాద సంఘటనమాత్రం కుటుంబరావు మనస్సుని వ్యాకులపరచింది. దాంతో అతనిలోనితృప్తి కాస్తా పెద్ద దెబ్బ తిన్నది. దానికి తనూ బాధ్యుడు కాదు; తనభార్యా బాధ్యురాలు కాదు. కేవలం దైవికంగాజరిగింది. కాకపోతే తన భార్యకి స్ఫోటకం రావాలని తను కోరుకుంటాడా లేక ఆమె కోరుకుంటుందా? యిప్పుడు తనభార్య కురూపి అచ్చంగా తన మేనమామ కూతురల్లే ఉంది. కాని దైవికంగా జరిగినదానికి తా నేం జేస్తాడు? ఏం చేయగలుగుతాడు?

"నీ జాతకంలో నీకు కురూపి భార్య అనే వ్రాసి ఉంది" అని సహృదయంగా అన్న మేనమామకూతురు మాటలతో తనభార్య మరీ వికృతంగా కనిపించింది కుటుంబరావుకి.

అంతకన్న మరే కోపం లేదు. అదైనా వారి దాంపత్యాని కేమంత పెద్ద అవరోధంగానూ లేదు.

ఇప్పుడు కుటుంబరావు పిల్లల తండ్రయ్యాడు. ఇప్పుడూ భార్య వీణమీద పాడుతూంటుంది. ఆమె సన్నటి పొడుగాటి వ్రేళ్ళు వీణాతంత్రులమీద అతి తొందరగా నాట్యం చేస్తూంటే కుటుంబరావుకు ఎవరో తన నరాలు పట్టుకు లాగుతున్నట్టనిపిస్తుంది. నాగసర్వం వింటున్న పాముల్లే భార్యగానంతో తన్మయత్వం పొందుతాడు. కాని అంత తన్మయత్వంలో కూడా ఆమెముఖాన్నిమాత్రం చూడలేదు.



# వాడిన రోజా



రోజమ్మ మృదుల హస్తాల్లో యెంతోమంది రోగులు ఆరోగ్యవంతు లయ్యారు...

...రోజమ్మ నర్సు; ఉబికి పొరలిపోతూన్న ఆయావ్వనంలో ఎంతోమంది పురుషుల్ని చూసినా మనస్సు చలించలేదు; కాని కుటుంబరావు తనచేతుల్లో కళ్ళు విప్పి దైనందిన ఆరోగ్యం పొందుతున్నప్పటి నుంచీ ఆమెలో మార్పు వచ్చింది...ఏదో పురాతన సంబంధం తమమధ్య వుందనే భావించుకొని అతనిమీద వ్యామోహ పడసాగింది. అతని నీరసంతోపాటు ఆమె మనోదృఢత్వం పోయింది

కుటుంబరావు వైద్యశాలనుండి విముక్తిపొంది స్వగృహం చేరుకున్నప్పుడు రోజమ్మకూడా స్టేషన్‌కి వెళ్ళింది. ఆమె దీనమైన చూపులకి ఆమె చేసిన పరిచర్య జ్ఞప్తికి తెచ్చుకుని కృతజ్ఞతాపూర్వకంగా ఒక పెద్దనోటు అందివ్వబోయేసరికి "మీ డబ్బు నన్ను తృప్తిపరచలేదు. నన్ను మరచిపోకుండా వుంటే చాలు. ఇంతకన్న ఎక్కువ కోరిక కోరను." అని కనులనుండి రెండు బాష్పబిందువులు రాల్చేసరికి కుటుంబరావుకు ఏదో అయినట్టయింది. వీరి ఇష్టం మీదే రైలు కదలవలసి వస్తే కొన్ని యుగాలదాకా కదలదు. గార్డు పచ్చజండా సలక్షణంగా ఊపుతున్నప్పుడు రోజమ్మ హృదయంలో ప్రళయం రేగినట్టయింది. రైలు బండి కనుచూపుమేర పోయేవరకూ అటువైపే చూస్తూ కుటుంబరావు చిరునామాను చూచుకుంటూ తిరుగుముఖం పెట్టింది.

నాటినుండి రోజమ్మలో పూర్వపు ఉత్సాహం, చురుకుతనం, నియమిత కార్యక్రమాల్లో ఆసక్తీ మందగించాయి. ఒకటి రెండు సార్లు అధికారులచేత మాటలుకూడా పడవలసివచ్చింది, అశ్రద్ధవల్ల. ఈ పరివర్తనకి కారణం గ్రహించుకునేశక్తికూడా లేదామెకి. కుటుంబరావుకి రెండు ఉత్తరాలు రాసింది. సకాలంలో వచ్చిన జవాబులు చూసి సంతోషించింది. కుటుంబరావు తన్ని మరచిపోలేదుకదా అని ఆనందించేది. చివరికి ఈ ఉద్యోగం మానేసి కుటుంబ

రావు దగ్గరకిపోయి అతని దగ్గరే వుండిపోదామనుకుంది. కాని అత నేమనుకుంటాడో అని భయపడి విచారించుకునేది.

కుటుంబరావు ఇంటికి వెళ్లేదన్నమాటేగాని స్టేషన్ దగ్గర రోజమ్మ మాటలు మనస్సుని నాటుకోవడంవల్ల తరచూ ఆమె గురించి యోచిస్తూ వుండేవాడు. ఆమె ఆదరాభిమానాలు లేకపోతే ఇంకా తను హాస్పిటల్‌లోనే వుండిపోవలసి వచ్చునేమో అనుకున్నాడు. ఆమె చేసిన అపార పరిచర్యకు తను సర్వదా కృతజ్ఞుడుగా ఉండా లనుకున్నాడు. అహోరాత్రాలు రోగుల కెంత సేవ చేస్తున్నారు? ఎంత బంధువులైనా అలా చెయ్యగలరూ!!

కుటుంబరావు డబ్బున్నవాడు. చదువుకున్నవాడు కూడా. అతని కతనే పెద్ద. బంధువుల్ని నమ్మడు. పై పెచ్చు విరోధం, అసహ్యం. డబ్బు చాలా వుందని ఉద్యోగ ప్రయత్నం చెయ్యలేదు. కాని వివాహం చేసుకోమని ఇచ్చిన సలహాలనీ, వచ్చిన ఉత్తరాలనీ చిత్తుకాగితాల బుట్టలలో పారేశాడు. "ఎన్నాళ్ళీ హోటల్ భోజనం సాగిస్తావ్? ఇల్లూ ఇల్లాలూ అన్నారు. అందుచేత ఒకింటి వాడి వవు. 'ఆఁ' అన్నావా రంభలాంటి పిల్లల్ని పెద్ద కట్నాలతో రప్పిస్తాను" అని చెప్పిన మిత్రుడుమీద కోపగించుకున్నాడు. ఆ దెబ్బతో ఎవరూ పెళ్ళిచేసుకోమని చెప్పడం మానేశారు.

హోటల్ మీాల్సు పడక ఓ వంటవాణ్ణి పెట్టాడు. కాని వంటవాళ్ళకి సహజ జాడ్యమైన దెబ్బలాటతో పని

నుండి మాన్పించేసేడు తిరిగీ హోటల్ భోజనం ఆరంభించేడు. కాని అది తన ఆరోగ్యాన్ని భంగపరుస్తున్నదనే దృఢనమ్మకం వచ్చిన తర్వాత పెళ్ళి చేసుకుంటే బాగుణ్ణనే ఉద్దేశం కలగకపోలేదు. స్నేహితులతో చెప్పేందుకు సిగ్గనిపించింది. ఆసమయంలో ఎవరైనావచ్చి సహాయం చేస్తే బాగుణ్ణనుకున్నాడు. కాని ఎవరు వచ్చేవారు ??

రోజమ్మకి ఉత్తరం వ్రాస్తే వస్తుందేమో అనుకున్నాడు. కాని అన్యథా భావిస్తుందేమోనని వూరుకున్నాడు. చివరకి ఓనాడు మహాధైర్యంతో "భోజన సౌకర్యం సరిగా లేనందున నా ఆరోగ్యం తిరుగ చెడుతున్నట్టు కనిపిస్తోంది. మీరు వీలైనంత త్వరలో కొన్నాళ్లు సెలవు పెట్టి వస్తే నా ఆరోగ్యాన్ని కాపాడినవా రవుతారు. ఒకసారి నన్ను మృత్యుముఖంనుండి రక్షించారు కాబట్టి మీనుంచి నా ప్రాణాలు నిలబడతాయని నమ్మకం" అని వుత్తరం వ్రాసి పడేశాడు.

అటువంటి అవకాశానికే రోజమ్మ ఎదురుచూస్తూన్నా కుటుంబరావు వుత్తరం అందినతర్వాత వెళ్ళడానికి కొద్దిగా జంకింది. కాని అతని ఆరోగ్యం పూర్తిగా చెడిపోతే మరీ నష్టమని ఈ సమయంలో వెళితే చాల బాగుంటుందని నిశ్చయించేసుకుని రెండు నెలలు శలవు పెట్టింది. వారంరోజులకి సెలవు మంజూరైన తరువాత రోజమ్మ బయల్దేరింది. ఫలానా దగ్గరకి వెళుతున్నానని ఎవరితో చెప్పకపోయినా

నలుగురూ యేమనుకుంటారో అనే అనుమానంతోనే రైలెక్కింది.

నిర్ణీతస్థలంలో రైలాగింది. కుటుంబరావు రోజమ్మకు స్వాగతమిచ్చాడు. ఇప్పుడతనితో మాట్లాడేందుకు సిగ్గుపడింది. కుటుంబరావుకీ అలాగే అనిపించింది.

"అంత నీరసించకపోతే నాల్గురోజులు ముందుగా ఉత్తరం రాస్తే ఏం పోయె?" అంది.

"మీరు వస్తారని నమ్మకం ఏంటి?" అన్నాడు.

ఒక్కక్షణం వూరుకుని "మందు పుచ్చుకుంటున్నారా?" అంది.

"లేదు."

"ఏం?"

"మీరొస్తేనేగాని..."

గర్వంతో కూడిన చిన్న మందహాసం చేసింది.

మేడముందు జట్కా ఆగింది. జట్కావాడి కిరాయి ఇచ్చేసి యిద్దరూ లోనికి పోయినారు. స్వంతమేడే కామోసు ననుకుంది రోజమ్మ లోలోపల.

వారంరోజులయేసరికి కుటుంబరావు స్థితిగతులు రోజమ్మకి బాగా అర్థం అయ్యాయి. ఏమనుకుంటుందోనని కుటుంబరావు తెప్పిస్తున్న కేరేజీభోజనం వద్దని చెపుదామనుకుని "నాచేతి భోజనం మీకు పనికిరాదనుకుంటాను" అంది.

"ఎవరన్నారు?"

"ఒఖరనేదేమిటి ? మీరు తెప్పిస్తున్న కేరేజీ చెప్తోంది."

"నా కట్టువంటి పనికిరాకపోవడా లెపుడూ లేదు."

"అయితే ఎందుకు మాన్పించరూ?..."

"...... ... ..."

"ఈ రోజునుంచీ మాన్పించండి."

"మిమ్మల్ని కష్టపెట్టడం నా కిష్టంలేదు."

"కష్టపెట్టడమేమిటి ? అడ్డమైనతిళ్ళూ తింటే ఆరోగ్యం చెడిపోదూ ?"

కుటుంబరావు వూరుకున్నాడు. మర్నాడునుంచీ రోజమ్మ వంట ప్రారంభించింది.

కుటుంబరావు ఆరోగ్యం రోజురోజుకూ బాగుంటోంది. ఇంకా ఔషధసేవ చేస్తూనే వున్నాడు. ఇంతలో రోజమ్మ శెలవు పూర్తి కావచ్చింది.

"నే నింక వెళ్ళిపోవాలి."

ఊరుకున్నాడు.

"నా సెలవు పూర్తి అవుతోంది. ఎల్లుండి డ్యూటీలో ప్రవేశించాలి."

"మరో రెండు నెలలు పొడిగించలేరూ" అన్నాడు దీనంగా.

"అక్కడికి వెళ్ళి పొడిగించి వస్తా."

"వెళ్ళక తప్పదన్నమాట."

"వెళ్ళాలి."...

"... ... ... ..."

"తిరిగి త్వరలో వస్తా."

"పోనీ ఆ వుద్యోగం మానేయకూడదూ...?"

"మానేసి...?"

అంత చులకనగా జవాబిచ్చే ప్రశ్న కాదనుకున్నాడు. ఒక్క క్షణం ఆలోచించి "ఇక్కడ వుండిపొండి" అనగలిగాడు ఎంతో ప్రయత్నంమీద.

"ఏమైనా ఒక్కసారి వెళ్ళాలి."

బలవంతం చెయ్యడానికి నాకేం అధికారం వుంది అనుకున్నాడు.

కొంతసేపు పోయాక "పోనీ మీరుకూడా రండి పూర్తిగా నయమయాక ఒచ్చేదురు గాని..." అంది.

"మళ్ళీ హాస్పిటల్లోకా..."

"ఏం అంత భయం" అని నవ్వింది.

"మరి రాలేను. మీరే త్వరలో..."

"మీరు అనడం మానలేదు?"

"క్షమించండి."

"అదుగో మళ్ళీ 'అండీ'ట."

"అబ్బబ్బ!"

కుటుంబరావు ఆలోచిస్తున్నాడు రోజమ్మ వెళ్ళిపోతే ఎలాగ అని. రోజమ్మకి తెలుసు తనగురించే ఆలోచిస్తున్నా

ఆమె వయస్సు నిర్ణయించడం కష్టం. చాలా కాలం నుంచి అలాగే వుందన్నారు చాలామంది. అది అసంభవం అన్నారు కొందరు. పరిమళం వెదజల్లే పుష్పానికి వయస్సు నిర్ణయించడం ఒక వెఱ్ఱిపని అన్నారు మరికొందరు.

ఏమైనా-నటీమణి స్త్రీ అనీ, వయస్సు మాట వదలి పెట్టి ఆమె అందమైన దనీ లోకం ఒప్పుకుంటుంది.

నటీమణి దర్శనభాగ్యంకోసం ద్వారాలదగ్గర పహారా యిస్తూండేవారు చాలామంది. ఆమె చంచల వీక్షణాలతో సంతృప్తిపొంది మహాప్రసాదం అనుకుంటూ వెనకచూపులతో ముందుకు సాగుతూ రాయో రప్పో తగిలి భూదేవికి సాష్టాంగంకూడా పడేవారు కొంతమంది.

కొందరు ఆమె గర్వి, పొగరుబోతు, చెడ్డది అన్నారు. అటువంటి వాళ్ళని హత్యచేస్తాం అన్నారు ఆమెభక్తులు.

దూరపు కొండలదగ్గర పారే సెలయేరులో, ఉషస్సులో విడిన లేత సూర్యకిరణాల్లో, నగ్నదేహాయై జలక్రీడలు సల్పుతూన్నప్పుడు, సెలయేటి చిరుకెరటాలమీద ద్విగుణీకృతంగా కనిపిస్తూన్న తననీడ వంపులవంపుల్ని చూసి మురిసిపోయేది.

నదీసైకతాల్లో, సంధ్యాసమీరాల్లో నదిమీంచి తనమీద పడుతున్న మేఘాల అరుణకాంతులలో తన శరీరచ్ఛాయను చూసుకొని ఆనందంతో హంసనడకలు సాగిస్తూంటే పడిపోతుందని భయంవేసేది.

తెల్లని తన శరీరానికి పాలమీగడవంటి చీర కట్టబెట్టి, మల్లెపూలు తలలో పెట్టుకుని పూతపారిజాతంక్రింద పూర్ణిమనిశలో సంపూర్ణంగా ఐక్యమైపోయింది.

ఆమె ఎర్రని పెదవులమధ్య విడిన నవ్వులో కనిపించే పళ్లు మల్లెమొగ్గల్ని మరపించేవి.

ఆమె నవ్వులో మల్లెలు వికసించేవి. విషాదంలో పద్మాలు ముకుళించుకుపోయేవి.

ఆమె ఒళ్ళు విరుపులో ఇంద్రధనస్సులు విరిసేవి. చూపులలో తటిల్లతలు మెరిసేవి.

ఆమె చలాకీలో అరబ్బీగుర్రాలు దాట్లువేసేవి.

నటీమణి ఆడుతుంది, పాడుతుంది. ఆమె నృత్యంతో రసికుల హృదయాలు పాతాళానికి త్రొక్కబడి పాటతో స్పృహతప్పితే వారి జేబుల్లో వున్న మనీపర్సులు తమతమ స్థానాలుతప్పి పోయేవి.

ఆమె ప్రేమను పంచిపెడుతూన్న సమయంలో దేవ దానవులకు కల్గినయుద్ధంవంటి యుద్ధాలు జరుగుతూండేవి.

ఏమైతేనేం పాపం! శ్రీమతి నటీమణి చనిపోయింది. నా లేఖిని చూపిన సానుభూతే యిది.



# రచనా వ్యసనం



మీ రేమనుకున్నా నేనేమీ అనుకోను గాని యదార్థంగా మీకు విన్నవించే దేమంటే తమరు అధమం నాయందు దయుంచి యీ ఉద్యమంనుంచి విరమించండి.

ఆ పెద్దమనిషి నావైపు విస్తుపోయి చూస్తున్నాడు. ఈమాటలు నే నంటానని ఏ మాత్రం తెలిసున్నా నాదగ్గరకు వచ్చేవాడేకాదు. నే నిలా నిరుత్సాహపరుస్తాననే అనుమానం అతని హృదయంలో ఏ వక్రకోణంలోనూ లేదు. అతని ఉత్సాహాన్నీ, ఉద్రేకాన్నీ, జిజ్ఞాసనీ అవరోధ పరచినందుకు నాకే చాలా కష్టమనిపించింది. చాలా నొచ్చుకున్నాను కూడా. కాని నేను చెప్పేదిమాత్రం యదార్థమని నాకు బాగా తెలుసు.

"నేను చెప్పినదానికి బహుశా మీ మనస్సు కష్టపడి ఉండొచ్చు. కాని వ్యసనాల్లోని కల్లా మహావ్యసనం యిది. ఇది అలవాటు కానంతసేపే. అలవా టయిందా యింక ఆ జీవికి మనశ్శాంతీ, సంతృప్తీ మిగతా కార్యక్రమాల్లో ఆసక్తీ పూర్తిగా నశిస్తాయి. అవి ఎప్పుడైతే నశిస్తాయో అప్పుడే జీవితం వక్రమార్గాలలో పడుతుంది. ఒకవేళ యీ ఉద్యమంలో కృతకృత్యులమై విజయగర్వంతో బైటకి

వచ్చినా కేవలం ఒక మహాసముద్రంలో ఒక్క జలబిందువు అని మాత్రం మరచిపోకూడదు."

పరిభవ హృదయంలోనుంచి వచ్చిన చిరునవ్వును చూసి సహించలేక పోయాను. యిటువంటి చిరునవ్వులో ఎంతబాధ ఉంటుందో నాకు తెలుసు. ఆబాధని నేను వ్రాయనూలేను, చెప్పనూలేను.

రెండు చేతులలోనూ జుత్తు రేపుకుని సముద్రం వంక చూసి నా వైపు చూశాడు. ఆ చూపుల్లోని బాధ.

"మీరు తప్పకుండా ప్రోత్సహిస్తారని ఆశించాను." అన్నాడు.

"ఆవిషయం నాకు తెలుసు. ఇందులో జిజ్ఞాస ఉండడం చాలా సంతోషించదగ్గ విషయం. కాని కేవలం దీని మీదనే మీ మనస్సుని కేంద్రీకరించడమంటే మిమ్మల్ని మీరే మోసం చేసుకోవడం అన్నమాట. యీవిషయాల్నే మూడు సంవత్సరాల క్రితం శాస్త్రికి చెప్పాను. నేను చెప్పేది అతని కేమాత్రం నచ్చలేదు. నామీంద కోపం కూడా వచ్చింది. 'మీరు గుత్త వ్యాపారంచేసే దురుద్దేశంతో మాబోటి వాళ్ళమీదకి రాకుండా చేద్దామని యిలా నిరుత్సాహపరుస్తున్నట్లుంది.' అన్నాడు కూడా. అతనలా అన్నందుకు నే నేమీ నొచ్చుకోనూ లేదు, ఆశ్చర్యపడనూ లేదు. అతని కావిధంగా అనిపిస్తుందని నాకు తెలుసు మీకూ్కడా అంతే.

ఇది కేవలం చేతిచముకుభాగోతమే గాని ఒకదమ్మిడీ కలిసి వచ్చేదికాదు. వచ్చినా నీటిని కొట్టి చెయ్యి నాకితే ఎంత దాహం తీరుతుందో అలాగే" నని చెప్పాను శాస్త్రికి.

"మరి పేరుప్రతిష్ఠలో" అన్నాడు శాస్త్రి.

ఆ మాటలు విని ఆతను నావైపు ఆశతో చూశాడు.

"మనబోటివాళ్ళకి కాదిది. పేరున్నంతమాత్రాన మనం బ్రతకలేం. బ్రతకడానికి డబ్బు కావాలి. డబ్బులేనిదే నీ పేరు ప్రతిష్ఠలు పోషిస్తాయా. ఏ జమీందార్లో, కోటీశ్వరులో అలా కూర్చోగలరు గాని నువ్వూ నేనూ కూర్చోగలమా, దీనివల్లనే వాళ్ళ జీవితం గడవాలని లేదు. అందు చేత వాళ్లు వ్రాయగలరు. డబ్బు యిచ్చికూడా వాళ్లరచనలు అచ్చు వేయించుకుంటారు. ఇంకా యిష్టైతే స్వంతంగా ఒక పత్రిక స్థాపించి కేవలం వాళ్ళ రచనలతోనే నింపి ఉచితంగా పంచిపెడతారు. నువ్వూ, నేనూ అలా చెయ్యగలమా?"

కళ్లు పెద్దవిచేసి చూశాడు శాస్త్రి.

"పోనీ నేనిప్పుడు ఏం నొల్లుకుంటున్నాను చెప్పూ. నేను యింటరు పూర్తి చెయ్యలేక పోవడానికి కారణం యిదే. నేను మహామేధావిని కాకపోయినా శుంఠని మాత్రం కానని నాకూ తెలుసు. పరీక్ష పోగొట్టుకునేంత శుద్ధ బుద్ధావతారాన్ని కానని మా లెక్చరర్లకీ, ప్రిన్సిపాల్‌కీ తెలుసు. కాని ఏం చేస్తాం, యీ మహావ్యసనం ఫలితంగా దండయాత్ర విరమించుకున్నాను."

శాస్త్రి నవ్వాడు.

ఇప్పుడు మీకు చెప్పేదీ అంతే. తరువాత నా మాట నిర్లక్ష్యంచేసి యిందులో దిగాడు. కాని ఏం ప్రయోజనం. నాటినుండి నేటివరకూ బి. య్యేలో కుస్తీపడుతున్నాడు. యీ మధ్యనే అతనికి ఉత్తరం వ్రాశాను, నువ్వేలాగూ ప్యాసుకాలేవనీ, అందుచేత చదువుకి స్వస్తిచెప్పి ఏదైనా ఉద్యోగంలో ప్రవేశించమనీ, ఒకవేళ నువ్వు ఎప్పటికో డిగ్రీ తీసుకున్నా అప్పటికి దాని విలువ పూర్తిగా నశిస్తుందనీ వ్రాశాను.

"పరిస్థితుల్ని బట్టి యింతకన్న మీకేం చెప్పలేను. మీ మనస్సు కష్టపడినా క్షమించండి."



# వ్యాపార పారం



'చూడండి! మన కెన్ని పత్రిక లున్నాయి' అన్నాడు మేనేజరు గుమాస్తాతో.

'లెక్కలేనన్ని ఉన్నాయండి.'

'అంటే ఉజ్జాయింపుకి చెప్పండి.'

'దిన, వార, పక్ష, మాస, త్రైమాసిక, వార్షిక పత్రిక లన్నింటినీ దృష్టిలో ఉంచుకుంటే కనీసం ఊరికి ఒక టైనా ఉంటుందండి.'

'వీటిలో గొప్పవీ, మంచివీ, ఏవో చెప్పగలరా.'

'వేటంత గొప్పవి అవేనండి. ఒక్కొక్క పత్రికకు ఒక్కొక్క ప్రత్యేకత ఉందండి. రాచకీయానికి ప్రాముఖ్యం యిచ్చేవి కొన్ని, సాంఘిక విషయాలకి ప్రాధాన్యం యిచ్చేవి కొన్ని. యీలాగనే అభ్యుదయానికీ, అనభ్యుదయానికీ, కామవ్యాపారాలకీ, మందుల వ్యాపారాలకీ, ఆడవాళ్ళకీ, మగవాళ్ళకీ, పిల్లలకీ, పెద్దలకీ, అందరికీ, కొందరికీ ఎన్నో...

'పోతేపోయింది కానిండి ప్రతి పత్రికకీ నేనుచెప్పే విషయాన్ని ప్రకటనకు యిచ్చేయండి. ఏమిటంటారా మన కంపెనీని చూసి ఓర్వలేనివాళ్ళు మన కంపెనీ పేరుతో వాళ్ళ వస్తువులు అమ్ముతున్నా రనిన్నీ, అందువల్ల ప్రజలు మోసపోకుండా జాగ్రత్తగా చూసుకోవలసినదనిన్నీ, ఈ విధంగా అన్ని పత్రికల్లో అచ్చువేయించాలి. ఈవూళ్ళో కవు లెవరైనా ఉన్నారా ?'

'ఓ ! ఉన్నారండి.'

'ఎక్కువగానే ఉన్నారేమటి ?'

'ఆ ! అధమం ఇంటికి ఒకడైనా ఉంటాడులెండి.'

'అయితే మరీమంచిది. నేను పైనచెప్పిన విషయాలు ఏ కవిగారి చేతనో చక్కా వ్రాయించండి. వ్రాసేందుకి ఏమాత్రం తీసుకుంటారేమిటి ?'

'ఐదురూపాయిలైనా యిస్తే బాగుంటుందండి.'

'మీరు ఉత్త తెలివితక్కువ వాళ్ళల్లే ఉందే!... బాగుండడానికి లెక్కేమి టండీ. నూరిస్తే బాగుండదూ. మీ కింకా బిజినెస్ అంటే తెలీదు. ఒక ప్రకటన వ్రాసేందుకు ఐదురూపాయ లెవరైనా యిస్తారండీ! నేను ఊళ్లో బిజినెస్ చేస్తూ ఉన్నప్పుడు ఒక సిజర్ పాకెట్‌కి ఒక కవి దొరికేవాడు. మీరేదో ఐదు రూపాయ లంటారు.'

'సరే భోగట్టా చేస్తానండి.'

'రేపటి కేలాగైనా సిద్ధంచెయ్యాలి.'

'సరే కానిండి, మనం కంపెనీ యింకా ప్రారంభించనే లేదు కదాండి యిలా ప్రకటనచేస్తే...'

'బిజినెస్‌లో ఉన్న రహస్యం నీ కింకా తెలీదు. ఇవన్నీ పాలిటిక్స్. రాజకీయాల్లో ఎన్ని తంత్రా లున్నాయో బిజినెస్‌లో అంతకు పదింత లున్నాయి. అందుచేతనే రాజకీయ తంత్రజ్ఞులు బిజినెస్ చేసే వాళ్ళ చేతులలో కీలుబొమ్మ లవుతారు.'

'సరేనండి.'



'జగద్విరాజిత విఖ్యాత ప్రఖ్యాత ప్రముఖాస్మదీయాభ్యున్నతసంస్థా యశశ్చంద్రికల గని యోర్వలేని కొందరీర్ష్యాళువులు కృత్రిమ వస్తుసంహతిని మా సంస్థదే యని విక్రయించుచు, మా సంస్థ కపప్రథ గల్పించుచున్నారు. గాన విషయ గుణగ్రహణపారీణులైన విజ్ఞ ప్రజానీకమునకు

విజ్ఞాపించుచున దేమన జాగ్రుతితో వస్తుపరిశీలనము గావించి మా వ్యాపారలాంఛనమును వీక్షింపుడని.'

'ఏమిటయ్యా యిది ?'

'ప్రకటనండి.'

'ఎవడు వ్రాశాడు దీన్ని ?'

'కవి.'

'అతని మొఘంలాగే ఉంది. ఇది ఎవడికైనా అర్థమౌతుందా ?'

'అతను కవే నండి. అంతా కవిగా రనే పిలుస్తారు.'

'చిన్నప్పుడు నన్నూ అలాగే పిలిచేవారు ! దేశివాళీ కవిత్వమని నేనూ వ్రాశేవాణ్ణి. దాని కేమిటిలే... ఇలా వ్రాశా డేమిటయ్యా! ఇది అర్థంచేసుకుందికి తెలుగు డిక్షనరీ దగ్గ రుండాలి. ఇదుత్త యూస్లెస్.'

'మన కంపెనీకి సరియైన ప్రకటన యిదేను టండీ.'

'నువ్వు కంపెనీసంగతి అందరికీ ఎందుకు చెప్పుతున్నావు?'

'వివరాలు చెప్పకపోతే ఎలా వ్రాస్తాడండి. అదిగాక ఎలాగూ అచ్చువవలసిందే కదండి.'

'నిన్ను ప్రకటనసంగతి చెప్పమన్నాను. గాని...'

'మీారు వ్రాసే ప్రకటన ఏమీా బాగులేదు. అందుచేత డబ్బు ఏమీా యివ్వను అని చెప్పండి.'

'బాగుంటుందాండి.'

'అదే మీకు మరోసారి చెపుతున్నాను. బాగుండడానికీ బిజినెస్‌కూ చాలా దూరం ఉందని.'

'అతను వ్రాసింది అతని కిచ్చేయండి...ఎందుకైనా మంచిది దాని నకలు తీసి ఉంచండి.'

'మంచిదండి.'

'......ఈవాళ యిరవయ్యో తారీఖండి.

'అవును.'

'ఒకటో తారీఖు వెళ్ళి పంధొమ్మిది రోజులైందండి.'

'ఆ మాట చంటికుర్రాడికి తెలుస్తుంది.'

'కాని తమకి...'

'ఏమిటోయ్ అయితే.'

'జీతం'

'జీతమా !'

'ఇంట్లో యిబ్బందిగా ఉందండి.'

'అయితే...'

'జీతం యిప్పిస్తారని'

'ఏం జీతం ?'

'గత నెలదండి.'

'చిత్రంగా ఉందే. నీకు జీతం యిస్తానని ఎప్పుడూ చెప్పలేదే. గుమస్తా కావాలని ప్రకటించాను. వచ్చావు. పనిచేస్తావా అన్నాను. చేస్తానన్నావు. చెయ్యమన్నాను. అంతే కాని మనకెక్కడా జీతంమాట రాలేదే.'

'ఎంత మోసం ! దగాకోర్ !'



# మత్కుణోపాఖ్యానం



రకరకాల రంగురంగుల మానవుల రక్తాన్ని పీల్చి మదించిన మత్కుణాలు ప్రయాణాయాసంలో నున్నాననైనా, ట్రెయిన్ తప్పిపోయాననైనా సానుభూతిచూపక సూదులవంటి మాతులతో గుచ్చుతున్నాయి. ఎన్నో శతాబ్దాలనుండీ. అంటే వాట్సుదొరగారు స్టీమ్ యింజన్ కనిపెట్టక పూర్వంనుంచీ ఉన్న మత్కుణకుటుంబాలు భారతదేశంలో అయోమార్గం వేయబడ్డ తర్వాత కట్టబడ్డ స్టేషన్ చేరుకుని వంశపారంపర్యా అనుభవిస్తున్న తమ శాశ్వత హక్కుల్ని యీనాడు యీ మొనగాడు స్టేషన్లో పడుకున్నాడని దయ తలుస్తూ ఊరుకుంటాయా! సినీమాకదంబంలో చూపించినట్టు ఎగిరి పొడుస్తున్నాయి మాయనల్లులు. ఆలోచించి చూస్తే జనమేజయమహారాజువంటి శుద్ధ తెలివితక్కువ పెద్దమనిషి ఎవడూ కనిపించడు! లేకపోతే నిత్యం బాధపెట్టే యీ నల్లుల్ని వదిలేసి, ఎప్పుడో ఒకసారి తారసిల్లే పాముల మీదకి పరిగెత్తేడు — 'సర్పయాగం' అంటూ! మత్కుణయాగం చెయ్యకూడదూ తెలివితక్కువాలని.

'మేస్టరుగారూ! నల్లులు యిలా చెలరేగుతూంటే మీరు తగిన చర్య తీసుకోకపోవడం శోచనీయం' అన్నా అప్పుడే భోజనంచేసి వచ్చిన చిన్న మేష్టరుతో.

'నల్లులాండీ !' చుట్ట ముట్టించి ప్రారంభించాడు. 'ఏమిటి చెయ్యడం సార్, యీ స్టేషన్నే చూసుకుంటామా, వచ్చే పోయే ప్రయాణీకుల్నే చూసుకుంటామా, ఎర్రని పచ్చని ఝండీ బత్తీల్నే ఊపుతామా, యీనల్లుల్నే చూచుకుంటామా. అందులో యీ యుద్ధం వచ్చిన తరవాత నాండి, గోచిపాతరాయుడికి కూడా పని ఎక్కువై పోయిందంటే నమ్మండి. ప్రతీవాడికీ పనే. అందులోనూ అర్జంటు పని చివరికి రైలు చూడనివాడు కూడా ఫస్టుక్లాసులోనికి తయారు. ఇంత శ్రమపడి చెమటలు కక్కుకుంటూవస్తే స్టాప్ బుకింగు. ఆ పెద్దమనిషి యింటిదగ్గరనుంచి తీసుకు వచ్చిన నల్లుల్ని యిక్కడ దిగుమతిచేసి చక్కాపోతాడు...'

చిన్న మేస్ట రెవడో ఘటికుడిలాగే ఉన్నాడు. ఇన్నాళ్ళకి అగ్నిహోత్రుడికి తగినవాడు దొరికాడని కరటక శాస్త్రుల్లు అన్నట్టు యిలా కబుర్లు చెప్పేవాడు చాలా రోజులుకి కనుపించాడు.

ఆరిపోయిన చుట్టకి అగ్గిపుల్ల కొట్టి బుగ్గలతో కొలిమి కొడుతూ చప్పుడు చేస్తున్నాడు.

'పాడుచుట్టలండి. కాల్చి తగలేద్దామన్నా కాలకుండా వున్నాయి. ప్రపంచం అంతా డీజనరేట్ అయిపోతున్నట్టు యీ పొగాకులోనూ నిర్జీవత్వం ఏర్పడి చివరకి ఫైర్ప్రూఫ్ అవుతోంది...'

మేస్టరు చెప్పింది నిజమల్లే ఉంది. వెలిగించామంటే మసి అయిపోయేదాకా ఆరని కత్తెర సిగరెట్లుకూడా యీ మధ్య మధ్యమధ్య ఆరిపోవడం మొదలెట్టాయి.

'ఏం చుట్ట' అంటూ విసిగిపోయి గిరవాటు ప్రారంభించాడు, 'ఎవడో నీరసించిన బక్కనాయన చుట్టిన ట్టున్నాడు! రేషన్‌బియ్యం తినే వాడికి అంతకన్నా ఎక్కువ బలం వస్తుందా ఏమిటి? అదేమిటోగాని పంతులుగారూ! ...మీరు పంతుల్లేనాండి... కాకపోయినా ఫరవాలేదు లెండి, యీ మధ్య పాశ్చాత్యులుకికూడా జ్ఞానోదయం అయి రినన్‌సియేషన్, డిటాచ్‌మెంట్ మొదలైన ముక్కల్ని పట్టుకుని ముక్కుమూసుకుని హక్సలే ప్రభృతులు బ్రాహ్మణులమైపోయా మంటున్నారుట. అలాంటప్పుడు వేద వేదాంతవిద్యానిలయమైన భారతదేశంలో బ్రాహ్మణుడికి తక్కువైనవాడు ఎవడూ ఉండడనే నా నమ్మకం...'

కీ యిచ్చి వదిలేస్తే చాలన్నట్టుంది, మాస్టరు వరుస. మాలిస్టులో తప్పకుండా చేర్చుకోవలసిన మనిషల్లే ఉన్నాడు.

'అలాంటప్పుడు మీరు పంతులుగా రనడానికి అభ్యంతరం ఏముంది! పంతులుగారూ! యీ కంట్రోలన్న పేరు ఏ దుర్ముహూర్తాన వాడుకలోనికి వచ్చిందో కాని, ఏ వస్తువుని కంట్రోలనండి - చివరకి గోమయాన్నికూడా, యింక అది ఏమైపోతుందో! చచ్చినా దొరకదు. ఇక రేషనంటారా

దాని పేరుబలంకూడా అలాగే అఘోరిస్తోంది. మీరు నమ్మినా నమ్మకపోయినా చెపుతున్నా - గుణుపురం నల్లుల్ని రేషన్ అనండి, అవి అమాంతంగా చెత్తయి ఊరుకుంటాయి. ఒక విషయానికి అభినందించాలిలెండి అజీర్ణ వ్యాధి కాస్త అణిగి నట్టుంది యీ రేషనింగు వచ్చాక.'

ఫ్లాస్కు తీసి 'టీ' నా కొక్కాస్త యిచ్చి తను కాస్త తాగాడు.

'పంతులుగారూ! ఇక్కడి నల్లులకే మీ రిలా అయి పోతున్నారే! మీ రెప్పుడైనా రంగురంగుల నల్లుల్ని చూశారా?'

ఇంతలో గంట్రమోగితే లేచి వెళ్ళి ఏదో ఫోగట్టా అందుకుని వచ్చి కూర్చుని ప్రారంభించాడు. 'మీబండీ గంట లేటు. లేటుగా రావడం దానికి మామూలే లెండి. నే నీమధ్య ఫలానా స్టేషన్‌లో ఉండేవాణ్ణి. ఆ స్టేషను కొత్తగా వేశారులెండి. ఏరోడ్రోమ్‌కి చాలాదగ్గర. ఆకాశంలోంచి నేరుగా ఊడిపడ్డ సైనికుల్ని రవణా చేయడమే ఆ స్టేషన్ పని. అక్కడుండేవండి నల్లులూ... పంచరంగుల నల్లులు. కేవలం విదేశాలనుండే వచ్చాయనుకుంటా, నవరత్నాల్లా నిగనిగ లాడుతూండేవి. అంతర్జాతీయ సైనికబృందం తీసుకు వచ్చిన వనుకుంటా...'

'అయితే ఏ డీ. డీ. టీ రోనా కొని ఎందుకు జల్లరండి మాస్టరుగారూ' అన్నా.

'మహాశయా! ఆరహస్యాన్ని చెప్పమన్నారా, ఎవరికీ చెప్పనని మీరు హామీ మాత్రం యివ్వాలి. యుద్ధానంతర పునర్నిర్మాణంలో రైల్వేశాఖ రహస్యప్రణాళికలో ఏం ఉందంటే - యీ నల్లు లున్నాయే, రైల్వేశాఖవారికి ఆప్త మిత్రములున్నూ, జీతంబత్తెం లేని నౌకర్లున్నూట. ఎందు చేతనంటారా రైల్వేశాఖలో పనిచేస్తున్న బద్ధకస్తుల్ని, సోమరిపోతుల్ని పొడిచిపొడిచి మీపని మీరు సక్రమంగా చేసుకోండి అని హెచ్చరిస్తూంటాయిట. అంతేకాదు. నిద్దర పోయి రైలు తప్పిపోకుండా ప్రయాణీకుల్నికూడా జాగృతిలో ఉంచుతాయుట. అందుచేత నల్లులు మన శ్రేయోభిలాషులు అని ఆ రహస్యప్రణాళికలో విస్పష్టంగా ఉందిట.'

ఇంతలో తిరిగీ గంట మ్రోగింది.

'పంతులుగారూ! యిక టిక్కెట్లు యివ్వకోవాలి' అని లేచాడు.

నేనూ టిక్కెట్టు తీసుకుని యింతవరకూ ఊసుపోయి నందుకు సంతోషిస్తూ, ప్లాట్ఫారంమీద పచారుచేయడం మొదలెట్టాను.



# జ్ఞానోదయం



'అపూర్వావకాశం !'

'కావ్యాలూ, ఖండకావ్యాలూ, నాటకాలూ, నాటికలూ, నవలికలూ, కథలూ, కథానికలూ, ఏదైనా సరే అముద్రితంగా ఉన్నాయని వ్యసనపడ నక్కరలేదు. శ్రీ జ్ఞానోదయా ప్రచురణల వారు అన్ని విధాలా తగిన సహకారం యివ్వడానికి కంకణం కట్టుకున్నారు. రచయితలకు యింతకన్నా మంచి తరుణం లభించదు. త్వరపడండి ! మీ తాలూకు వ్రాతప్రతులతో మా కార్యాలయానికి హాజరు కావచ్చు.'



పై ప్రకటన దివ్యశ్రీని బాగా ఆకర్షించింది. రెండు మూడు సార్లు చదివాడు లోలోపల పొంగిపోయాడు. అలాటి ప్రకటన ఎన్నడూ చూస్తానని అనుకోలేదు. కాని అలాటి అవకాశానికి మాత్రం ఎదురు చూస్తున్నాడు దివ్యశ్రీ. తన భాగ్యం పండిన దనుకున్నాడు. గబగబా వెళ్ళి అముద్రితంగా ఉన్న తన కథానికల పుస్తకాల్ని మరోసారి లెక్కపెట్టాడు. పదమూడూ సరిగ్గా ఉన్నాయి.

దివ్యశ్రీ ఒక రచయిత. అడపాతడపా అతని రచనలు ఆ-యీ, పత్రికల్లో పడుతూండేవి. కాని, అతనికి ప్రతిఫలం

మాత్రం కిట్టుబాటుగా ఉండేదికాదు. వ్రాయడం మానుకున్నాడు. అందుచేత ఓ డజను కథలు వ్రాసి ఏ ప్రచురణ కర్తకో అమ్మకుంటే కిట్టుబాటు అవచ్చునని నిశ్చయించుకొని అప్పటినుంచీ ఇటువంటి అవకాశానికి ఎదురుచూస్తున్నాడు.

తను వ్రాసిన ప్రతి పుస్తకంలోని అతిమిక్కిలి మంచి కథానికని ఎంచి తీసి వేరే వ్రాశాడు. ఈ కథానికల్ని ఒక పుస్తకరూపంలో తీసుకురావాలని అభిలాష.

జ్ఞానోదయా ప్రచురణాలయానికి వెంటనే బయల్దేరుదామనుకున్నాడు. కాని మనీపర్సు బరువుగా లేదు. యథార్థం చెప్పవలసివస్తే రచయితల మనీపర్సులు ఎప్పుడూ బరువుగా ఉండవు.

జ్ఞానోదయా ప్రచురణల వారికి తన పుస్తకాన్ని యివ్వగానే కొంతడబ్బు యిస్తారనే నమ్మకంతో అప్పుచేసి బయల్దేరాడు.

♦ ♦ ♦ ♦

'జ్ఞానోదయా ప్రచురణకర్తలు తమరేనా' ?

'అవునండీ... తమ పేరు ?'

'దివ్యశ్రీ'

'ఓహో మీరా ! మిమ్మల్ని రమ్మనమని వ్రాసి పెట్టాలన్నాను.'

"లేదులెండి, నేనే వచ్చాను మీ ప్రకటన చూసి."

'చాలా సంతోషం !'

'మీరు యీ ఉద్యమానికి పూనుకోవడం ఎంతో ముదావహం.'

'లేకపోతే ఎలాగండి మీబోటి రచయితలకి ఎంత మందికి ఎంత కాలంనుంచి ఆశాభంగం జరుగుతోందో చూడండి.'

'ప్రస్తుత కాలానికి ఎంతో వాంఛనీయమైన సంస్థ.'

'అందుకనే వెనకా ముందూ ఆలోచించకుండా ప్రారంభించాం.'

'మీబోటి సారస్వత సేవాపరాయణులు ఉంటారని ఎన్నడూ అనుకోలేదు.'

'అభిలాష ఎన్నాళ్ళనుంచో ఉంది కాని అవకాశం ఇప్పుడు చిక్కింది.'

'ఆంధ్రసారస్వతంలో అభ్యుదయం వచ్చినట్లే.'

'ఏదో మీబోటి రచయితల సహకారం ఉండాలి గద.'

'ఇది అవినాభావ సహకారం.'

'... ... ... ... ...

... ... ... ... ...'

'మీ రచనలు తెచ్చారా ?'

'ప్రస్తుతం ఒకటే తెచ్చాను.'

'అరెరె అన్నీ తేలేక పోయారా.'

'అన్నీ అంటే నేను పన్నెండు కథానికాసంపుటాలు వ్రాశాను. ఆ పన్నెండు సంపుటాల్లోనూ ఒక్కొక్క సంపుటంలో ఒక్కొక్క ఉత్తమ కథానికను ఏర్చి ఒక సంపుటం కూర్చాను. ఈ సంపుటంలోని పన్నెండుకథలూ నా అత్యుత్తమ కథానికలు. ఇంత చక్కని కథలు భవితవ్యంలో వ్రాస్తాననే నమ్మకం కూడా లేదు నాకు.'

'మిగతావి కూడా పంపండి. వాటిని కూడా అచ్చువేయిస్తాం.'

'వెళ్ళి పంపుతాలెండి '

దివ్యశ్రీ కథానికల సంపుటిని అందించాడు. ప్రచురణకర్త దీక్షగా చదువుతున్నాడు.

కథలన్నీ పూర్తిగా చదవడం అయింది. ప్రచురణకర్త సంతృప్తి పొందినట్లు మొహంలో కనిపెట్టి దివ్యశ్రీ సంతోషించాడు.

'పత్రికల్లో ప్రచురణ అయ్యే కథలకి ఏ మాత్రం ప్రతిఫలం ముడుతూంటుంది' అన్నాడు ప్రచురణకర్త.

'అయిదూ, పదీ—పత్రిక తాహతుబట్టి'

'అయితే పన్నెండుకథలకీ అరవై అన్నమాట. సొమ్ము పుస్తకం అచ్చయాక చలామణీ అవుతున్నప్పుడు మీకు పంపుతాం. ప్రస్తుతం మా సంస్థ పురిటిబిడ్డ. బాలారిష్టాలన్నీ తీరి ఆరోగ్యంగా ఉన్నప్పుడు ప్రతిఫలం బాగా ముట్టచెబుతుంది.'

దివ్యశ్రీ ఏమీ అనలేకపోయాడు. కాని తను యిరవై రూపాయలు బదులుచేసుక వచ్చాడు.

ఆరునెలలయింది. జ్ఞానోదయా ప్రచురణలవారి దగ్గర నుంచి వార్తలు లేవు. దివ్యశ్రీ వ్రాసిన ఉత్తరాలకి జవాబు కూడా లేదు.

ఒకనాడు దివ్యశ్రీ స్టేషన్‌కి వెళ్ళాడు. హిగిన్‌బాథమ్స్‌లో పుస్తకాలు తిరగేస్తూంటే ఒక కథానికల సంపుటి కనిపించింది. సహజ ఉత్సాహంతో పేజీలు త్రిప్పాడు. అన్నీ తనకథలే. రచయిత పేరు మాత్రం జ్ఞానోదయ ప్రచురణల యజమానిది. నిలువునా నీరైపోయాడు దివ్యశ్రీ.



# మారుతి మృదంగం

(ఊహా ప్రహేళికలు)



౧

మధురస్వప్నాల తరళ కాంతుల నీడలజాడల్లో విషాద ప్రపంచయాత్రా విరాగినై, సుఖంలేని దుఃఖానికీ దుఃఖంలేని సుఖానికీ అతీతమైన అనుభూతికోసరం అన్వేషిస్తూ అన్వేషిస్తూ దక్షిణాన్ని ప్రదక్షిణం చేదామని బయలుదేరాను.

వెలుగు చీకట్ల వేకువఝాములు వేనవేలు చూసి రోసిన జీవితానికి మరొక వేకువ వెర్రికేక రైలుకూతతో శ్రుతికల్పింది. నిద్రపోతూన్న తెలివి తేటలు బద్ధకంగా లేస్తున్నాయి అంతులేని ఆవులింతలతో. హేమంత ప్రభాత వాయువులు సిగరెట్టును కాల్పిస్తున్నాయి. ఆరుగంటల ఆలస్యపు రైలుబండి అశాంతితో, హాహాకారాలు చేస్తూ, ఎగురుతూ దుముకుతూ పరుగెత్తుతోంది. అశాంతిపొగలు ఆవలింపుల సిగరెట్టు పొగతో కలిసి వస్తున్నాయి.

విలయకాలపు వెకిలినృత్యపు వెలవెలతో మెల మెల్లగా తెలతెల్ల వారుతోంది. జీవిత సంరంభానికీ, జీవ

సంక్షోభానికీ రంగస్థలమైన పగటి కాలం వెగటుకాలం ఆసన్నమవుతోంది. అందుకే విపరీతమైనభయం. న్యాయాన్ని అన్యాయంగానూ, అన్యాయాన్ని న్యాయంగానూ నిరూపించే కాలం పగటికాలం. శాస్త్రాభ్యుదయం అనే కృత్రిమ నామంతో మానవ లోకాన్ని మారణహోమం చేస్తున్న వినూతన శస్త్రాస్త్రాల్ని సృష్టించడానికి అదునైనకాలం పగటికాలం. కాయితాలతో అంశాతిని రెచ్చగొట్టే పగటి కాలం ఆసన్న మౌతోంది. అందుకనే భయం. అందుకనే కాబోలు గురుతుల్యులు కవి కృష్ణశాస్త్రి కృష్ణపక్షపు నిశీథాల్నే కోరుతుంటారు.

ఊర్వశీ! నీ ఉద్దేశంకూడా నిజమే. కాదనను నిశీథంతో కూడా అక్రమాలూ, అన్యాయాలూ నెమరు వేస్తూనే ఉంటాయి. కాని యీ రెండిటికీ తారతమ్యాలు మేరలేనంత, రాత్రి దౌర్జన్యాలు ఆపూట ఆకలి తీరుతే అంతమౌతాయి, కాని యీ పగటికాలపు దౌర్జన్యాలు అనంతమై విశ్వరూపం ధరిస్తున్నాయి. హృదయపుటాల్లో పునాదులు వేసుకున్న యీర్ష్యా, అసహనం, నాగరికులమని వేషాలు వేసుకున్నంత మాత్రాన పోతాయనుకున్నావా ఊర్వశీ!

నీ ప్రయాణంలో అర్థంలేదన్న నీ మాటకి యదార్థంగా అర్థంలేదు. అది తెలుస్తే యీ ప్రయాణమే లేదు. నూతన సుఖజీవితానికి తగిన సాధన సంపత్తిని సముపార్జించుకుందికి

జానెడుపొట్ట పట్టుకుని బయలుదేరావనుకో. ఇంటిదగ్గర యింతడబ్బు ఉందంటావు. కాని కావలసిన వాటి నన్నిటినీ యిస్తుందని పొరపాటుపడకు. యోచనాశక్తి గల్గిన యోషిన్మతల్లికవు నీవూ పొరపాటుపడితే అర్థం లేదు. కాని అక్కడికి నేను ఎప్పుడు వచ్చేదీ ఎలా చెప్పగలను. అను నిత్యం చూస్తూన్న అవే ముఖాలు, వింటున్న అవేమాటలు, అవేయిళ్ళు, అవేకుర్చీలు యింకా యింకా అవే అవే ఎంత కాలం ఓపికతో చూస్తు వింటూండడం. నీకు విసుగు, అస హ్యం వెయ్యదూ ఊర్వశీ! ఎంతకసి ఓర్చడం——అందుకనే నూతన వాతావరణంలో యీతకొట్టి తేగలిగే దేముంది? కావలసినంత పుణ్యం తెస్తాను! అడ్డమైన నదులన్నిటిలో మునిగి కావలసినంత పుణ్యం సంపాదిస్తాను. అందులో నీకు కావలసినంత యిస్తాను. కాకపోతే అంతా యిస్తాను. మొన్న ఏదో పుణ్యక్షేత్రంనుంచి తిరిగివస్తున్నాను. ఎవరో పెద్ద మనిషి, పుణ్యం సంపాదిద్దామని బయలుదేరాడు. ఆ పుణ్యంతో దేవేంద్రపదవి పొందాలనే ఊహ. అతని మాటల్లో సేతు హిమాచలాలు గంతులేశాయి. ఇంకా బాగాడబ్బు ఉందిట. అందుకింకా తిరుగుతాడుట పుణ్యం కోసం. ఆ క్షణంలో నా పుణ్యాన్నంతటినీ అతనికి అమ్మే ద్దామనుకున్నాను. కాని దానికి విలువకట్టే మొనగాడెక్క డున్నాడు? కర్షకవీరుల కాయంనిండా కాలువకట్టే ఘర్మ జలానికి ఖరీదుకట్టే షరాబు లేడోయి అని శ్రీ శ్రీ అన్నట్లు

నా పుణ్యానికి ఖరీదుకట్టే మొనగాడేడీ ? అందుచేత ఆపు చెయ్యవలసి వచ్చింది.

పై విషయాలు ఊర్వశికి వ్రాసి పడెయ్యాలనుకున్నాను. కాని ఉత్తరాలు వ్రాయని మిత్రుల సహవాసబలంవల్ల యిది కార్యరూపం ధరించేసరికి మరొక హేమంతం గంతు వెయ్యాదా అని అనుమానిస్తూంటగా రైలుబండి ఆగింది, పెద్దరాకుసి కేక వేస్తూ. ప్రయాణికుల కోలాహలం చెలరేగిన పెద్దస్టేషను. రంగురంగుల మనుషులు, రకరకాల మనుషులు, బాలురూ, వృద్ధులూ, స్త్రీలూ, పురుషులూ, ఒకటే హడావిడిగా తోసు కుంటూ, రాసుకుంటూ, ముఖముఖాలు చూసుకుంటూ, చీదరించుకుంటూ, చిరునవ్వులు నవ్వుతూ ఎక్కుతున్నారు, దిగుతున్నారు. ప్రయాణికుల్ని హెచ్చరిస్తూ మేతమేసిన రైలుబండీ కూతకూసింది. రైలు కదలుతూన్న సమయానికి దిగిపోవాలని బుద్ధిపుట్టి పెట్టీ బెడ్డింగూ పట్టుకు దిగిపోయాను.

## ౨

కృష్ణపక్షపు హేమంత శర్వరి, భూతకాలంలో అను భూతమైన వలపుల తలపుల కలతలు. దగ్గరగా దోమల సంగీతం. ఎదుటి మేడమీద సంగీతాన్ని సాగదీస్తున్న స్త్రీ కంఠం. ఊపిరి సలపకుండా కొట్టుకుంటూన్న త్యాగయ్యా, త్రికాలాలలోనూ పొయ్యిలో నిప్పువేసే ఆ అమ్మాయి

వేళ్ళకు చురుకుదనం హెచ్చాయి వీణమీద తొందరగానే నడుస్తున్నాయి. నల్లులూ, దోమలూ పెట్టే బాధకి యిటు వంటి సంగీతమైనా లేకపోతే చాలాకష్టం అనుకున్నాను. చెలరేగిన చలితో జగం గజగజలాడుతోంది. దుప్పటి తీసి దులిపి కప్పుకున్నానే కాని చలి ఆగిందికాదు. బట్టలవల్ల ఆగే చలి కాదని నాకు తెలుసు. కాని ఏం లాభం, యీ ప్రవాసంలో ప్రవాసం. అందులోను చలికాలంలో, – తొంభై రాత్రులు. ఎనిమిదివందల మైళ్ళ దూరంలో... ...ఊర్వశి !

కలహాంతరితయై అభిసారికయై చివరికి విప్రలబ్ధయైన ఊర్వశి జ్ఞప్తికి వచ్చి లేచి కూర్చున్నాను. నిశీథ వాతావరణం నిశ్చల నిశ్శబ్దాన్ని నిశ్వసిస్తోంది. ఆ క్షణంలో ఊర్వశిని మరచిపోవడానికి ప్రయత్నిస్తూ నిశ్శబ్ద మహానగరంలోని నిశాసౌందర్యాన్ని చూదామని బయలుదేరాను. అంతర్ధానమైన జీవిత అంతరార్థాన్ని అన్వేషించడానికి అనువైన కాలం అదే. తన సుకుమార హస్తాల్లో ప్రపంచాన్ని నిద్రపుచ్చిన పరమేశ్వరుడుకూడా ఆవులిస్తున్నాడు. నగర వీధులంట తిరుగుతున్నాను. చైతన్యాన్ని కోల్పోయిన మహానగరం సుషుప్తికి పాదసేవ చేస్తోంది. శ్మశానంలోని పిశాచాలు నగరిమీదికి దండెత్తి వస్తున్నాయి. చురుకుగా వీధులంట తిరుగుతున్నాను. జనసందోహంతో కిటకిటలాడే ప్రదేశాలు యివేనా అనిపించింది. విశ్వాసమూ, ప్రేమా, ఆశా మొదలైనవన్నీ యీ సమయంలో ఎక్కడ దాగుంటాయి ? పాపం

వాటికికూడా యిదే విశ్రాంతి సమయం. దూరంగా ఉన్న నదిమాత్రం తన ప్రక్కలోని చిన్నగుట్టకి జోలపాట పాడు తోంది.

మహానగరం మధ్యలో మహాదేవుని మహామందిరం. వేలాది స్త్రీ పురుషుల సంపదల్నీ, సపర్యల్నీ స్వీకరించిన శ్రీ నటరాజస్వామి అలసి సొలసి జగన్నాటకశాలలో యినప కటకటాల వెనుక ఆవులిస్తున్నాడు. ఏదో మహాపరాధం చేసి జైల్లోపడ్డ ఖైదీలా కనిపిస్తూన్న జగత్ప్రభువుని చూసి చాలా జాలి వేసింది. ఏ మహాపరాధానికి ప్రభూ నీకీ కఠిన శిక్ష! సన్నిధానంలో వెలుగుతూన్న అఖండజ్యోతి నటరాజు నిట లాక్షిలో ప్రతిబింబిస్తోంది. 'స్వామీ!' అని పిలచాను. 'ఈ' అనే ప్రతిధ్వని. మీసృష్టీ, మీ పరిపాలనా ప్రజారంజకంగా లేదు స్వామీ! ప్రజాభిప్రాయాన్ని గుర్తించడంలో తమరు పరాకు చిత్తగిస్తున్నారు. మీలోనూ పక్షపాతం ప్రబలింది. అది న్యాయం కాదు ప్రభూ!

నటరాజు పెదవులమీద చిరునవ్వు నాట్యమాడింది. నిటలాక్షితో జ్యోతి మెరిసింది.

నీ వెర్రివేషాలు తగ్గించు ప్రభూ! నీ పేరుతో నిర్వ హింపబడుతూన్న మహామతకలహాల తీవ్రజ్వాలల్లో రోజుకు ఎన్ని ప్రాణాలు పోతున్నాయో నీకు తెలీదు కామోసు. మానవుల్ని యీ విధంగా రెచ్చగొట్టి దానవులుగా మార్చ డంతో నీ ఉద్దేశానికి శాశ్వతపర్యవసానం నీమీద నమ్మకం

పూర్తిగా పోవడమేనని గుర్తించుకో. ఆ ఆవేగంలో, ఆవేశంలో ఖచ్చితంగా అడగవలసిన నాలుగు మాటలూ అడిగేశాను. కాని శిలా ప్రతిమనై, దేవాలయంలో బంధింపబడ్డ ప్రభువు ఏమి సమాధానం యిస్తాడు. ఆలయం మౌన ముద్రలో లయమైపోయింది.

శిలావిగ్రహాలే మాటలు నేర్చేమాటుంటే భారతీయులింకా ఎంత అజ్ఞానులుగా ఉండవలసి వచ్చునో ఊహించుకో లేకపోతున్నాను.

మహాలయపు మూరు మూలల అంధకారంలోంచి దివాంధాలు ఘూకరించాయి.

'మాటలురాని యీ ప్రతిమ మానవలోకము కెల్ల నేతనై...' అనుకుంటూ తిరుగుముఖం పట్టాను.

ప్రభాత మృదంగ ధ్వని తరంగాలు కురంగాలవలె ఎగిరి దుముకుతున్నాయి. గమ్యస్థానం చేరుకోవాలి. ఇక తెల్లవారుతుంది. సూర్యుడు తూర్పు దిక్కునే ఉదయిస్తాడు. ఆ మనుష్యులు ఆ పనులే చేస్తూంటారు. పాత ధోరణిలోనే వ్యవహారాలు సాగుతూంటాయి. వేశ్యాగృహంనుంచి స్వగృహోన్ముఖుడౌతూన్న ఆ శాస్త్రుల్లే ధర్మ శాస్త్రాల మీద యధారీతిగా మనకి ఉపన్యాసాలు ఇస్తూంటాడు. దొంగలికి షాతాలు చెప్పి తిరిగి వస్తున్న ఆ పోలీసే నాలుగు బాటలు కలిసే చోటున పెద్దమనిషిలా నిలబడి యధా ప్రకారంగా రాక పోకలకి అదుపు ఆజ్ఞలు చేస్తాడు. అంతా చర్విత

చర్వణం. నవ్యత్వం ఎక్కడుంది? నవ్యత్వమో అని పలవరించేవాళ్లు కూడా ఆ పాత పనులే చేస్తారు. 'పాడిన పాటనే తిరిగి పాడిన దాసరిం జూడ రోతయా' అన్నట్టు.

అంతర్ధానమైన జీవితాంతరార్థం అలానే ఉంది. అందుకనే చర్విత చర్వణమైన కార్యకలాపాల్ని నిర్విఘ్నంగా కొనసాగించడానికి నేనూ బయలుదేరాను.

3

నిర్వికల్ప నిశ్చల సమాధిలో నిమగ్నుడైన, శాంతి వాంఛితుని, ఊహాపథాలు వక్రించి విక్రమ కంటకాల పైకి దాడి వెడలుతున్నాయి. శల్య మాత్రావశిష్టుడైన మహాశయుడు, తన ఆశయ సిద్ధి త్వరలోనే, లభిస్తుందనే ఆశతో, ఎదురు చూస్తున్నాడు. ఇంద్ర ధనస్సువలె, పంచరంగుల భవితవ్యంలో, ఎంత హాయీ! ఎంత సౌఖ్యం!



మహోజ్జ్వలభావి! అబ్బ! ఎంత అగాధంగా వుంది. పాతాళానికి మార్గం యిదే కామోసు. శాంతికాంత నపహరించిన దానవాగ్రేసర చక్రవర్తి యీ కూప గర్భ కుహర నిశీథంలో విశృంఖల విహారియై వికటాట్టహాసాలు, చేస్తున్నాడు. బెదరి, మనసు చెదరిన స్నిగ్ధసుకుమారి శాంతి,

ప్రాణాపాయ సమయంలో ఉంది. దుర్భేద్యమైన యీ మహా తంత్రాన్ని చీల్చి చెండాడి శాంతిని రక్షించేవారెవరు? ముల్లోకాలకీ ఏకైకమైన అపురూపవతి శాంతికై సర్వ ప్రపంచానీకమూ, మహోత్కంఠతతో, ఒకే కంఠంతో, వాంఛానాదాన్ని గావిస్తూ, తహ తహ లాడుతోంది. పలవరింపులు పెడ బొబ్బలుగా మారాయి. శాంతి సంరక్షణకి కృతనిశ్చయులయారు. శాంతిభద్రతా సంఘం, శాంతిరక్షక సమితీ యిత్యాది సంఘాలూ, సమితులూ, ఎన్నెన్నో లేచాయి. కార్యశూరులూ, వీరులూ, అఘటన ఘటనా సమర్థులూ, జ్ఞాన వృద్ధులూ, దీక్షా పరాయణులూ, గీతా పారాయణులూ, ఖాజీలూ, దగుల్బాజీలూ, రకరకాల వికారాల రంగురంగుల మనీషులు శాంతికోసం పరితపిస్తూ, శాంతికోసం పలవరిస్తూ తాను శాంతిని పట్టితెస్తే ఘనత తనకే దక్కునంటూ, ఎందరో కొమ్ములు తిరిగిన పెద్ద మనుష్యులు రొమ్ము విరుచుకుని మీసాలు మెలివేశారు. సభలూ, సమావేశాలూ, ఉపన్యాసాలూ, ఉపన్యాసకుల హస్తవిన్యాసాలూ, నానాటికీ పెరిగిపోతున్నాయి. కార్యశూరులు, కసరత్తు చేసి, లంగోటీలు బిగించారు.



శాంతికీ జై ! కావాలి శాంతి !! తేవాలి శాంతి!!! ప్రతిచోట యివే నినాదాలు.

శాంతిని తీసుకు వచ్చేందుకు సంగ్రామ సంసిద్ధులయ్యారు. శాంతిమీద ఎక్కువ మోజుపడే శాస్త్రజ్ఞులు వివిధ వినూత్న మారణ, విభీషణ శస్త్రాల్ని తయారుచేశారు. ప్రతివాని చేతిలోనూ విషవాయువు, మరఫిరంగి, అధునాతన ఆటంబాంబ్.

సంగ్రామ సన్నాహాలు పూర్తయ్యాయి. సమర దుందుభులు మ్రోసేయి. వినూత్న శస్త్రాలతో వికట విన్యాసాలు చేస్తూ ప్రయాణం సాగిస్తున్నారు. నదీనదములూ, అడవులూ, కొండలు గడచిపోతున్నాయి. నిష్క్రమణలో దివారాత్రాలు పరిభ్రమిస్తున్నాయి. ఆ అనంతయాత్రలో సంగ్రామశూరుల శక్తి సడలుతోంది.



"ఇంక ఎంత దూరం స్వామీ!" అలసి సొలసిన వీరవర్యుని అనాసక్తపు హృదయఘోష.

అదుగో, అదుగదుగో!! ఆ వనాంతరస్థ కూపగర్భగోళ తమోరాశిలోన నున్న దల్లదుగో! అదుగో పద! చిట్టచివరకు సేనలన్నీ చేరుకున్నవి నూతిదగ్గర.

విజృంభించిన వీరావేశంతో జ్వాలాకిరణాలు ప్రసరింపజేసి అన్వేషిస్తున్నారు.

ఆ జ్వాలాకిరణాల్నీ, పరమాణు శస్త్ర సంహతినీ,

మహాసైన్యాన్ని చూచిన శాంతి భయపడి తన తాత్కా-
లికపు సంరక్షకునివద్దకు పరుగు తీసింది.



శాంతీ! శాంతీ!! హా! ఎన్నాళ్ళకి ఎన్నాళ్ళకి! నీకోసం ఎంత తల్లడిల్లిపోతున్నామో, తెలుసా! రా తల్లీ! రా! అలా చూస్తా వేవమ్మా! మమ్మల్నందర్నీ మరచిపోయావా! రా పోదాం! ఎన్ని కోట్లమంది నీ కోసం కనిపెట్టుకున్నారో తెలుసా! నిద్రాహారాలు వదిలేసి ఎదురుచూస్తున్నారు. ఏదీ తల్లీ నీ మధురకంఠంతో స్వస్తివాక్యం.

ఓరీ మాయలమారీ! మా శాంతి, మా శాంతి, మా అపురూపశాంతి మనస్సును విరిచేశావ్. శాంతిని మాకు దక్కకుండా చేయాలన్న నీ దురుద్దేశం మాదగ్గర సాగదు. ఏకాంతంగా ఉన్న మా శాంతికాంతను అపహరిస్తావా, దుర్మతీ!

"చూశావా శాంతీ! నిన్ను యిన్నాళ్ళు కాపాడినందుకు ప్రతిఫలం"



"ఓ యోధాగ్రేసరచక్రవర్తులారా! ఆగండి. అతను నన్ను అపహరించలేదు. నేనే అతని ఆశ్రయం కోరి వచ్చాను."

"శాంతీ !"

"అవును నేనే వచ్చివేశా !"

"మేం ఏం అపరాధం చేశామని వచ్చావు శాంతీ !"

"మోసం ! మోసం ! ఈ మాయల మరాఠీగాడు ఆడిస్తున్న నాటకం! లేకపోతే మన శాంతి ఏమిటి, తనంతట తానే స్వయంగా యిక్కడకు రావడ మేమిటి ? చంపండి ! పొడవండి ! !"

"సావధానంగా వినండి. మీలోని తామసం యింకా చల్లారలేదు. నేనే అతని దగ్గరకు వచ్చేశా. మీ యావన్మంది అభిమానానికీ కృతజ్ఞతా పూర్వక వందనాలు. మీరు పడ్డ శ్రమకి ఫలితం శూన్యం అవుతుందేమో అని విచారిస్తున్నాను. తిరిగి వెళ్ళిపొండి నమస్కారం !"

"నీవు లేనిదీ ఒక్క క్షణమైనా, నిలువగలమా శాంతీ !"

'ఆ మాటలు హృదయంలోనుంచి వచ్చినవి కావు మహాశయా !' నోటిలోనుంచి వచ్చాయి. నామీదనే మీకంత ఆకాంక్షా, ఆపేక్షా, ఆదరం, అభిమానం ఉంటే మీలో ఎవరైనా ఈర్ష్యా, అవమానం, హింసా, అసత్యం, గర్వం, అహంకారం, లేనివాడు నా చెయ్యిపట్టుకు నడిపించండి. ఆత్మపరీక్ష చేసుకోండి. అబద్ధమాడేరా యీ మహాకూపంలోంచి మీదకు వెళ్ళలేరు. ఆత్మపరీక్ష ప్రారంభించండి. ఇప్పుడే వస్తా, సోదరి విశ్రాంతి పిలుస్తోంది.

సర్వజనీనమైన సంక్షోభ సమస్యలు విషమించి ఏకా కృతి ధరించి, విషం గ్రక్కే భుజంగమై విభీషణంగా బుసలు కొడుతోంది. ఇరుకు గదిలో యిమడని నిబిడనిశ్వాసాలు భయంకరంగా శ్మశానధూమాలవలె చెలరేగుతున్నాయి.

"ప్రపంచంలో శాంతి భద్రతల్ని ప్రజ్వలింపజేసి, సర్వమానవులకీ సమస్త సౌఖ్యాలూ సమకూరుస్తాం. సౌజ న్యాన్నీ, సౌదర్యాన్నీ పెంపొందిస్తాం. సర్వస్వాతంత్ర్యాల్నీ ప్రపంచప్రజానీకానికి సమిష్టి స్థిరాస్థిగా చేస్తాం. భూమిని స్వర్గంగా మారుస్తాం. నరకాన్ని నరికేస్తాం. పాపాన్ని పాతేస్తాం..."

ఇంకా ఏవేవో కర్ణరసాయనమైన కమ్మని వార్తలు కళ్ళల్లో మెరుస్తున్నాయి, ఆ ద్విజిహ్వాం కళ్ళల్లో తళతళ మని. అది కేవలం ద్విజిహ్వాం. రెండు చక్కని నాలుకలూ, నాలుకలంట కారుతూన్న తేనె చినుకులూ.

ద్విజిహ్వాం తెచ్చిన నీలి వార్తా పత్రికలో సువర్ణా క్షరాలతో ప్రస్ఫుటంగా ప్రచురింపబడ్డ వార్తా ప్రవల్హిక—

అవిభక్తస్వతంత్ర భారతం త్రైవర్ణాల్లో ఎంతో రమణీయంగా అపహరణీయంగా కనుపిస్తోంది. ఎటుచూసినా కోలాహలం, జనసందోహం, ఉద్రేకపూరితుల నినాదాలు.

ఫలానా ఊరులో బాంబుల ఫ్యాక్టరీ నిర్మాణసన్నాహాలు చురుకుగా జరుగుతున్నాయి. పరమాణువు సంకల్పంతో ప్రభవం పొందిన శాస్త్రజ్ఞులు నిద్రాహారాలు వదిలేసి, దీక్షాకంకణాలు ధరించి యింకా తీవ్ర పరిశోధనలు గావిస్తున్నారు. కొందరు జ్వాలా కిరణ తోరణాల్ని తయారు చేస్తున్నారు. ఇంకా యిలాంటి శాంతి సంస్థాపనా కార్య కలాపాలు విరామం లేకుండా జరుగుతున్నాయి.

ఇక శాంతి రావటానికి ఏ మాత్రం ఆలస్యం లేదు. అది కడపటివార్త. శాంతిని చూడాలని చాలా కుతూహలంగా ఉంది. నిజానికి శాంతిని నేను ఎరుగను. అథమం స్వరూపాన్ని కూడా ఏ సన్నివేశంలోనూ సృష్టించుకో లేక పోతున్నాను. మిత్రుడైన చిత్రకారుణ్ణి చిత్రించమన్నాను. వాయిదా వచ్చేసరికి శాంతే వచ్చేస్తుంది. అటువంటి శాంతి – స్వరూపశూన్యమైన శాంతి, దుర్లభమైన శాంతి, దురూహ్యమైన శాంతి నేడు దుర్వారమై సహస్రముఖాలతో, సహస్ర మార్గాలలో, సహస్రాంశుని ప్రచండమయూఖాల వలె బయలుదేరి రావడానికి యిక ఏ మాత్రం ఆలస్యము లేదు, నాందీ ప్రస్తావనలు జరుగుతున్నాయి. పొగమంచు తెరలు కదలుతున్నాయి. శాంతికాంత కరకంకణ నిక్వణాలు, పదమంజీరరవాలు దిశల మారుమ్రోగుతున్నాయి. శాంతిని చూసే భాగ్యం లభింపజేసినందుకు చేసిన అపూర్వ కృషికి హృదయపూర్వక అభివందనాలు,

తెర ఎత్తారు. ఒక మహాపురుషుడు రత్నసింహాసనం మీాద ఆసీనుడై ఎదురుగా ఉన్నాడు. హస్తాలు చాలా ఉన్నాయి. శిరస్సు ఒక్కటల్లే ఉంది. అత నెవరో నా కర్థం కాలేదు, బహుశా సంక్రాంతి పురుషుడై ఉండొచ్చు. అతని అభయహస్తం తెలివిగానే ఉంది.

అతనికి ముందుగా రెండుప్రక్కలా నిలబడి నమస్కరిస్తున్నారు. ఎరిగిన మొహాలల్లే ఉన్నాయి.

"హే ప్రభూ! ఉద్యోగం అవుతుందనే భ్రమతో వున్న ఆస్తినంతా చదువుక్రింద తగలేశాను. చదువు కున్నాను. మేధావి ననిపించు కున్నాను. కాని దేనికోసరం యింత కష్టపడ్డానో అది నన్ను మోసపుచ్చింది. విశ్వప్రయత్నాలు చేసినా ఉద్యోగాలు దొరక లేదు. అది నా అసమర్థత చేతనూ కాదు, తెలివితేటలు లేకనూ కాదు. నేను బ్రాహ్మణుడ నవడమే తప్పట."

"క్షత్రియుడ నవటంచేత నమస్కరించలేదు. ప్రస్తుతం మా పని చాలా అధ్వాన్నంగా వుంది. పూర్వపుస్థితిలో వుండే మార్గం ఆలోచించండి."

"దండాలు స్వామీ! దండాలు. అచ్చంగా ఏడు కొండల వేంకటరమణమూర్తల్లే వున్నారు. ఏదో కులధర్మాన్ననుసరించి వ్యాపారం చేశాను. విరామం లేకుండా బహిరంగంగానే కాకుండా రహస్యంగాకూడా వ్యాపారం సాగించాను. ఉద్యోగస్తులకి లంచాలూ, గించాలూ పోను ఒక

లక్ష లాభంవచ్చింది. ప్రభువులు !...ఐదుగురు పిల్లలకీ ఐదు లక్షలైనా యివ్వాలని ఉంది. మరి నాలుగు కాలాలపాటు యుద్ధము, యీ కంట్రోళ్లూ వుండేటట్టు చెయ్యండి స్వామీ! దండాలు దండాలు."

"ఓయ్ దేముడా! కష్టపడి, పగలనక రాత్రనక, యెండనక వాననక పండించిందల్లా ఆఖరుకి అన్యాయంగా యీ కోమటాళ్లు చిన్న పళ్లు పెట్టి తీసుకుపోతున్నారు. ఉద్యోగస్తులు బతకనివ్వకుండా వున్నారు. వీళ్ళ బాధనుండి రక్షించు స్వామీ! గరిసె వెయ్యిరూపాయలకి అమ్ముకుంటాను."

"మాకు కావలసినదేదో మా కివ్వకుండా అక్కరలేని దేదో యిచ్చారు. దేవాలయాల్లో ప్రవేశార్హత కలిగినంత మాత్రాన మాకేం కలిసి వచ్చింది. మాకు తినేందుకు వుంటేగా దేముడికి పెట్టేందుకు ? ఇలాటి అనవసరమైనవి మా కెందుకు స్వామీ! అవసరమైన తిండీ, బట్టా, చదువూ యిలాటివి యిప్పించకుండా."

మహాపురుషుని ముఖలక్షణాలు చూస్తే అందరి విన్నపాలూ విన్నట్టుగానే వుంది. అభయహస్తాన్ని చూపాడు. రపీమని తెర వాలింది.

నాటకం రసవత్తంగానే వుంది. చివరికి భయానకరసం భగ్గున మండింది. పటాస్ కాయ పేలింది. ఆఖరి తెర ఎత్తారు.

కరకు మొరకుల కరజాలాల్లోని కరవాలాలు జారిపడి పోయాయి. అంతా అయోమయంగా వుంది.

ధరిత్రి—వృద్ధ కార్మిక కర్షకుల ఎముకలతో సార వంతమైన ధరిత్రి; మహామేధావుల మేధస్సులతో, ఉద్రేక పూరితులైన యువకుల హృదయాలతో అలంకరింపబడిన ధరిత్రి—రుధిరవాహినిలో యీత కొడుతోంది. చూడలేక పెద్ద కేక వేశాను. దిశలు మ్రోగేటట్లు ఒక మహా సాత్త్విక ప్రళయఘోష భూనభోంతరాళాల్లో ప్రతిధ్వనించింది.

త్రుళ్ళిపడి కళ్ళు విప్పాను. ఒకరోజుకు అనగా యిరు వది నాలుగు గంటలకూ నాలుగు రూపాయలైన అరవ హోటేలు కంట్రోలు అద్దె గదిలో విద్యుద్దీపవన క్రింద కునికిపాట్లు పడుతున్నాను. చేతిలోని సిగరెట్టు ఎప్పుడో జారిపడి బూడిదై పోయింది.



# గ్రంథ పరిచయం

బొడ్డపాటి వేంకటకుటుంబరాయశర్మ, M. A., B. Ed.,



తొలిసారి సవిమర్శనగా నేను చదివిన గల్పికల సంపుటి సంజదీపం. శ్రీ పూ. భా. గారీ సంపుటికి కర్తలు. గల్పికా కర్తలలో ప్రసిద్ధులుగా, తద్రచనలో కృతబుద్ధులుగా, వీరు లబ్ధప్రతిష్ఠులు. వీరి గల్పికలలో నే నభినందింపఁగల్గిన యొక్కొక్కదానినిగూర్చి సంగ్రహంగా రెండుమూడు వాక్యాలు వ్రాస్తాను.

1. సంజదీపం :

వ్యక్తుల మనోవికారాలనీ, వ్యవస్థల వెఱ్ఱితలలనీ వికల్పించి పరిహసించడం అనే లక్షణానికి ఇది పరమలక్ష్యమైంది. (a) వేరుశనగపప్పు తినడం—మంచినీళ్లు తాగడం: (b) రాట్నం పొయ్యిలో పెట్టలేదుగదా! (c) నాలుగు దారాలు రోజూ తీస్తే యే ధోవతో లేక చీరో (క్రమభంగం సొగసు కనిపెట్టండి) అవదూ? (d) మొత్తంమీద ఫీళ్లు (రేపనింగువాళ్ళు) బతకనిచ్చేటట్లు లేదు; (e) గాంధీగారి ఆఖరుతత్వం నిరశనవ్రతం ఉండనేఉంది; (f) ఎన్ని ఉన్నా లేవనడం ఆడవాళ్ళ లక్షణం—మొదలైనవి పరిహాసకుశలత కుజ్జ్వలోదాహరణాలు. 'అన్నీ సమస్యలే' :— 'ఎప్పుడో పస్తుపడుకుంటామో లేదోగాని, యిప్పుడు (దీపం మంగళం

పాడే స్త్రీ) పడుకోవాలి' అనేది ప్రారంభానుకూలమైన ముగింపు "గల్పికో"కు. మధ్యలో జగద్విశాలమైన సంచారం చేసిచేసి వస్తుంది గల్పిక, అని చెప్పటానికి కూడా యిది ఉదాహరణ మాతోంది.

2. మానసపుత్రుడు :

గల్పిక సన్నివేశప్రధానమనటానికీ, కొసమెరుపుతో ముగిస్తుంది అనటానికీ, దీన్ని లక్ష్యంగా చెప్పాలి. అత్తవారింటికని ఉత్సాహంతో ఏ స్టేషనుకు వెళ్ళాడో, ఆ స్టేషనే యావజ్జీవితమూ తలపునకువచ్చినపుడెల్లా విషాదం గొల్పటం చూడండి చిత్రం !

3. తీయని వెన్నెలరేయి :

ఇందులో గూడా ఆకస్మిక సంఘటనచేత కొసమెరుపే ప్రధానంగాని, 'గాడిదా ! కునుకుతున్నావురా !' అనిన నిరంజనానికి, 'లేదు బాబయ్యా !' అంటూ వెంకన్న సమాధానమిస్తూ, నిరంజనాన్ని గాడిదకు దండ్రిగా చేసి వేయడం మరచిపోలేం. ఆధునిక వివాహాలకు ముఖ్యకారణాలైన పత్త్రికలని వీరు బాగా దూయబట్టగలరు.

4. పెళ్లి చేసిచూడు :

మన ఆసక్తి చూరగొనే ఆరంభమున్నా క్రమక్రమంగా విషయాల లోతు చూపించడమూ ఇందులో అద్భుతంగా చిత్రింపబడ్డై. గోపాలంపంతులూ — ఆయన

కూతురూ — వీరి స్వభావాలు వర్ణింపబడడంగామ, వర్ణింపబడడం యిందులో ప్రధానం. పెళ్ళిచేస్తే యిల్లుగుల్ల; చేయకపోతే సంఘం ఒల్లదు; ఇదొక నిరుత్తర నిరంతర ప్రశ్న. 'పురుషుల్లో వున్న అహంకారశక్తుల్ని దుళ్ళకొట్టే వఱకు పెళ్ళిచేసుకోను' అన్న అమ్మాయిగారు రూపసియైన అవబోయే భర్తను చూసేసరికి... తన ఉపన్యాసమంతా మరచిపోయింది. ఇదే యిందులో కొసమెరుపు. పెళ్ళయ్యే వఱకూ కబుర్లే గాని, కాపురం చేస్తూంటే తల్లిదండ్రులు జ్ఞాపకమొస్తారా! అది అంతా మంగళసూత్ర మహత్త్వం. ఇంతకూ పెళ్ళిళ్ళు చేయడమూ? చేయకపోవడమూ? మన సంఘంలో ఏది కాయ? ఏది పండు? ప్రారంభిస్తూనే గోపాలం భార్య 'కాయా! పండా!' అని వేసిన యీ ప్రశ్న యిప్పటికీ మనకు సమస్యగా మిగలనే మిగిలింది.

5. క్రీనీడలు :

భార్య యెంత గయ్యాళిగంపైనా కొడుకెంత దుర్మార్గుడైనా వాళ్లు బ్రతికి ఉన్నప్పుడుండే ఆనందంలో వెయ్యోవంతుకూడా ఇప్పుడు లేదనుకునే సీతారామయ్య నిజంగా ఎప్పుడూ శాంతిశూన్యుడే! తన క్రీనీడని చూసే యింకా యింట్లో మనుషులున్నారని కాలం గడుపుకువచ్చే ఆతనిని నిజంగా యే ఆశారేఖ కదిలిస్తుందో! వదిలితే చాలు నను కొన్న పీడ వదిలిన తర్వాత గతించిందే మంచికాలం అని

మళ్ళీ అంగలార్చడమే కథలో కొసమెరుగు — జీవిత సత్యమూ యిదేగదా!

6. జీవితం

భార్యని పంపించమని యెన్నిసార్లు మామగారు ఉత్తరాలు వ్రాసినా జవాబే యివ్వని సూర్యారావు "మీ కూతురు మిమ్మల్నందరిన్నీ చూడాలని యెంతో ఆత్రుత పడుతోంది" అని వ్రాసి ఆమెను పంపివేయడం చూడగా పరిస్థితుల ప్రభావమే. సంఘటనల ప్రాముఖ్యం యిందులోను అగపడుతుంది.

7. సలహా :

ఏ "తటిల్లత" మిస్ అవటం నిజంగా దేశంచేసుకున్న అదృష్టమో, ఆ తటిల్లతయే, హెయిరాయిల్ కంపెనీవాళ్ళ వల్లా, స్నోవాలాలవల్లా, పూతనగా మారిపోయి చర్మరోగ వైద్యనిపుణులచికిత్సకోసమై స్విట్జర్లాండ్ పలాయనమైంది, తటిల్లత తన చెల్లెలికి వ్రాసిన జాబుతో ముగిసింది యీ గల్పిక. "తటిల్లతా నిషాని" అనే తుదిపలుకులో వుంది, యిందులో వైచిత్రి అంతా. "తటిల్లత వ్రాలు" అని వ్రాసుకొనే యోగ్యతన్నా లేని దానికే లోకం అంత బ్రహ్మరథం పట్టింది అనడం. హేళనగా నిజం చెప్పటం.

8. సానుభూతి :

పసిపిల్లయైన లలితలో భయమూ, చనువూ, సానుభూతీ, నిరీక్షా, నైరాశ్యం, మాార్ధవ్యం, యివన్నీ పరిస్థితి

ప్రభావాలే! సన్నివేశ ప్రాధాన్యానికి యీ గల్పిక పట్టుకొమ్మ. ఇంత పిన్నవయస్సులో లలిత కా సానుభూతి, పూర్వజన్మసంస్కారరూప ప్రేరణయే. దీనినే పాత్రలు ఇంచుక సహజత్వాన్ని అతిశయించడ మంటాము. వ్యవహార జగత్తుకన్నా భిన్నమైన కావ్యజగత్తు కొంచెం సహజత్వాన్ని అతిశయించినపుడే సృష్టింపబడుతోంది.

## 9. నవ్వే పువ్వులు :

ఇక ఏమైనాసరే ఆ వృత్తివల్ల జీవనం గడపకూడదని నిశ్చయించుకున్న కనకాంగిని, తూలుతుంటూ, తూలుతుంటూ వచ్చిన అన్న, ఉన్న వందరూపాయలూ జల కడుగుకొని పోవడం చూడండి! దీన్ని సన్నివేశ సంఘటన గాక, మరేమంటాం? అలా నిశ్చయించుకొన్న కనకాంగికీ, మరునాటి భోజనానికై ఇలా ముస్తాబై గుమ్మందగ్గర నుంచోక తప్పదాయె! ఇంతకు మించిన పరివర్తనం మరేముంటుంది?

## 10. పిల్ల నచ్చింది :

ఎవర్నీ చేసుకోనన్న కుటుంబరావు పెళ్ళికి మొగ్గడం, స్ఫోటకపు చింత మొద్దయిన మేనమామ కూతుర్ని తప్పించుకున్న అతనికి, ఇతరత్రా పెళ్ళియాడిన పిమ్మట కూడా ప్రారబ్ధంకొద్దీ భార్య స్ఫోటకపు చింతమొద్దే అవడం, దీనికితోడు ఎవ్వరూ అనుకోనట్లుగా ఆ మేనమామ అతనికి

సాయపడటం — ఇవన్నీ మహాత్సంఘటనలే! గల్పిక ఒక అనుభవం, లేదా - ఒక అనుభవంలోని దశాభేదం, దశా పరిణామం — అంటానికి ఈ గల్పిక సజీవోదాహరణం. తన భార్యస్ఫోటకానికి పూర్వమూ, తర్వాతా కూడా కుటుంబరావు ఆమె గానానికి, నాగస్వరం వింటున్న పాములే తన్మయుడయ్యాడు. కాని ఆ అనుభవాల్లో మళ్ళా వ్యత్యాసం వుంది. అప్పుడానందంలో విన్నాడు; ఇప్పుడు విషాదంలో. అప్పుడామె అందానికి గర్వపడుతూ విన్నాడు; ఇప్పుడు కించతో వింటున్నాడు. ఇదే గల్పికకు ఆయువుపట్టు. అనేకమైన ఆరోహణావరోహణ క్రమాలకు గురియైన మనఃపరివర్తనముకూడా యిందులో గమనార్హమే!

11. వాడిన రోజా :

కుటుంబరావునకు వ్యాధి పోయింది. దానితోపాటుగా ఎన్నడూ చలించని రోజమ్మకు ధైర్యమూ పోయింది. ఇది ఒక పరివర్తనం. అతడేమనుకుంటాడో అని భయపడి రోజా తన మనస్సు వెల్లడించక లోలోన విచారించుకోటం రెండో పరివర్తనం. అతని జాబుకోసమే యెదురు చూస్తూకూడా, తీరా ఆజాబు వస్తే, వెళ్ళడానికి జంకు. ఇది యింకో దశ. తనకు తానే పెద్దయైన కుటుంబరావు మటుకు కుటుంబరావు, పెళ్ళి వద్దనుకొని, హోటలు తిండి పడక, రోజాను రమ్మని వ్రాస్తే యే అపార్థం వస్తుందో అని భయంచే మానుకొని

కూడా, యేదో యేమరుపాటున ఉత్తరం వ్రాసిపారేస్తాడే! అది, ఆ పరిస్థితుల్లో ఉండే మనస్సుయొక్క సహజమైన అస్థిమితత్వ వర్ణనం. తాను సెలవు పెట్టి వెళ్ళితే నల్గురూ ఏమనుకుంటారో అనే సంశయం అలా ఉంటూండగానే రోజా ప్రయాణం సాగించడం. బలవంతపెడితే ఉందాం అనుకుంటూనే తిరిగిరావడం. అతడు రమ్మన్నందె యెందుకు వెళ్ళాలి అనుకుంటూ అతని ఉత్తరం రాకమునుపే అతని చివరిచూపు చూడ్డానికో అన్నట్టు వాళ్ళవూరు చేరుకోడం—యివన్నీ యేమిబోధిస్తున్నై? "జీవించడం అలవాటైపోయింది కాబట్టి జీవిస్తున్నాం; మరణించడం విధిఅయిపోయింది కాబట్టి మరణిస్తున్నాం"— అవియేగా?

ఉచ్ఛ్రాయ పతనాలతో గూడిన సంఘటనల చిత్రమే యిందులోని శిల్పం. ఈ ఘటనలనే ప్రముఖ సన్నివేశాలు అనండి, మన స్తత్వాలు అనండి ఏమైనాగాని, వీటిలో ప్రడీనం, ఉడ్డీనం, సండీనాలతో గూడిన ఒక క్రమవికాస ముంది. అది అనుక్షణ పరివర్తనతో ప్రత్యక్షమయ్యే సన్నివేశాలలో ఉపస్థితమై రాణిస్తోంది. సూక్ష్మంగా వింగడించి పరిశీలిస్తే రోజా మనో వ్యాపారంలో ఏడుదశలు, పైజెప్పిన మాదిరివి, ప్రత్యక్షమౌతై.

12. పాపం నటీమణి :

ఇది వైయక్తికమైన ఒక అవహేళన మాత్రమే !

13. మహా వ్యసనం :

కావ్యరచన అనుబంధవృత్తి కావాలిగాని, ప్రధాన వృత్తి అయితే నేడు లబ్ధి శూన్యం— అనేదే యిందులోని పిండితార్థం. తనదే పత్రిక, తానే సంపాదకుడూ, అన్నీ తన రచనలే, లేదా—కొన్ని తన్ను గూర్చినవి తానే— ఇలాంటి శ్రీమంతులకైతేనే రచనలు నేడు గిట్టుబాటుగా ఉన్నై అన్నదే యిందులో ప్రతిపాద్యం.

14. వ్యాపారసారం :

ఇతర్లను మోసగించమని గుమాస్తాకు నేర్పుతూ యజమానుడు తాను గుమాస్తానే మోసగించి, ఆత్మానుభవం కల్గిస్తాడు గుమాస్తాకు, తత్త్వం సుబోధకమయ్యేందుకు

15. మత్కుణోపాఖ్యానం :

తన్ను వెటకారం చేయబోయిన ప్రయాణీకుని పైననే దెబ్బతీస్తాడు స్టేషనుమాస్టరు. ఇలా వెక్కిరించబోయి వెలికిలబడడమనేది, వైచిత్రి. దీనికి ఉదాహరణంగా, అర్థంతోనేగాక, శిల్పంతో కూడా చెప్పదలచుకున్నాడో కథయిత, అన్నట్లుగా—నల్లులను తిట్టిపోయడంతో ప్రారంభించబడ్డ గల్పిక, నల్లుల గుణగణాల ప్రశంసతో ముగిసింది. ఒక్కటి ముగియగానే పక్కన ఒక్క నవ్వునవ్వి యింకో గల్పిక చదవడం ప్రారంభిస్తాము— అనడానికి కూడా యిది నిదర్శనమే !

16. జ్ఞానోదయం :

దిక్కూ దివాణం లేనిది యీ మన దేశం. సృష్టికి ప్రతిసృష్టి చేసిన విశ్వామిత్రులనే మించారేమో అహంకారంలోనూ, ఆగ్రహంలోనూ, అనిపించే గ్రంథప్రచురణ వ్యాపారస్థులూ, పత్రికా ధిర్వాహకులూ కూడా దీనిలోనే ! బ్రహ్మనే తాము సృష్టించాము అంటారు వీళ్ళు. వీళ్ళ సర్వజ్ఞత్వంతో మనకు నష్టం లేదు; కాని వాళ్ళ మోసంతో, ద్వేషంతో చాలా నష్టం వస్తోంది అనేదే దీని ఉద్దేశం.

17. మారుతి మృదంగం :

దీని కిదే సాటి. ఇది శ్రీ పూ. భా. ని శ్రీశ్రీ ప్రభృతుల సమీపాన నిల్పింది ఇందులోని భాషావిశిష్టతా, ఒక్కొక్కప్పుడు మార్మికమూ ఇంకో అప్పుడు విప్లవాత్మకమూ అని చెప్పదగిన యోజనావిధానం మొదలైనవన్నీ, శ్రీ పూ. భా. రచనల్లోకెల్లా ఇది పరకోటి నంటిందని నిరూపిస్తున్నై. గ్రంథ విస్తర భీతిచే ప్రస్తుతం సంక్షేపించి చెబుతాను—

ఈ మృదంగధ్వనివల్ల కల్గిన ప్రథమతరంగం జీవిత యాత్రను, తీరని కొన్ని సాంఘిక దురాచారాలపైని చిన్న దండయాత్రగా భాసింపజేస్తోంది.

రెండో తరంగం, పాతపై రోతను, ఏదో క్రొత్తపని చేయాలనే ఉబలాటాన్ని సూచిస్తుంది. ఐతే మళ్ళా ఆ

ఆసక్తిలోనే అశక్తి. ఇలాంటి ప్రవృత్తులన్నీ యుద్ధానంతరం ప్రబలేవే !

ఆత్మవంచకులూ, జగద్వంచకులూ అయిన విదేశ నాయకులవల్ల గగనకుసుమమైన శాంతిని గురించినది మూడవ తరంగం.

కులవ్యవస్థయొక్క తత్త్వం తెలియక, కుల దురభిమానాలవల్ల కుమిలిపోయే లోకంలోని అశాంతి నాల్గో తరంగంలో ధ్వనిస్తోంది. 'హస్తాలు చాలా ఉన్నాయి; శిరస్సొక్కటల్లే ఉంది'—— అంటే పద్ధతులు వేరైనా గమ్యం ఒక్కటే అనీన్నీ, బాహిరమైన భిన్నత్వం ఏకత్వంలోనే వ్యవస్థిత మనీన్నీ, ధ్వని.

ఈ అభినందన వాక్యాలు సర్వతోముఖ సమగ్రాలనుకోవద్దని మిమ్మల్ని వేడుకొంటున్నాను.



త్వరలో రానున్నది :

"సంజప్రణయం" పూ. భా.